# ఉషాసుందరి




పైడిపాటి సుబ్బరామశాస్త్రి

తృతీయ
ముద్రణము

R. C. No. 1116 M 3/57
18-12-57 గా రౌసుగోయిత్తై
డి. పి. ఐ. గారిచే
గ్రంథాలయములకు
సూచింపబడినది.

మూల్యము
రు. 1-50

ప్రతులకు :
విద్వాన్
పైడిపాటి సుబ్బరామశాస్త్రి
మారుతీనగర్
విజయవాడ

# ఉషాసుందరి : సహృదయులు

1. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ఉషాసుందరి ఉత్తమ శ్రేణికిం జెందిన ప్రమాణనాటకము (1945)

2. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఉషాసుందరిని చదివి మిక్కిలి ఆనందించితిని (1945)

3. శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి

దీని నాంధ్రవిద్యార్థులకు పఠనీయముగ నిల్పుట యర్హము.

4. శ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రి

సర్వనియమ నిబద్ధమయ్యు నవ్యతా విలసితమై సాహితీపరమావధి సంధుకొన్న మహోజ్జ్వలమైన రచన.

5. శ్రీ వేలూరి శివరామశాస్త్రి

చదివి ఆనందించితిని. అయాచితముగా ఆనందము కలిగించు కవుల ఋణము నెటుల తీర్చుకొనవలయునో కదా.

6. శ్రీ సూరి రామకోటిశాస్త్రి

కళాసృష్టి విద్యుత్తువలె మెఱసిన ఉత్తేజకరమైన నాటకము. తెలుగునాట స్ఫూర్తిప్రదము.

7. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

కాళిదాసు శాకుంతలము పఠించుటకు ఫలితముగా నవతరించి వినిర్మితమైన 'ఉషాసుందరి' ప్రేక్షకరంజకమై తన చక్కదనము వెలయించునని భావించుచున్నాను.

8. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

నాటకాంతమునగదా సాహిత్యము। ప్రయోగానుకూలమైన ఉషాసుందరి నాటక రచనలో శాస్త్రిగారి కలము పంచకళ్యాణివలె పరుగులుపెట్టినది.

ప్రాచీనపద్ధతిలో ప్రస్తావన నవ్యరీతిలో నాందియుగల యీ రచన పాత్రక్రొత్తల మేలికలయికకు మేటి తార్కాణము.

9. శ్రీ బులుసు వెంకటరమణయ్య

ఇంతవరకు వెలువడిన ఉషా నాటకములలో మీ రచనయే మిన్న యని నా అభిప్రాయము.

10. శ్రీ నండూరి బంగారయ్య

సంభాషణములు చురుకుగ నడచుచు నేటి పరిస్థితులనుకూడ ధ్వనిత మొనర్చుచున్నవి. మీ సాహిత్యసేవకు అభినందనములు.

11. శ్రీ ప్రాసం నరసింహారావు

మీ కవితాకల్పనలందుల్లోని భావగర్భితప్రౌఢాంగనా వంగ్య విలాసవిన్యాసాన్ని అరమోడ్పు కన్నులలో అర్థంచేసుకుంటూ ఆనందిస్తున్నాను. (1945)

12. శ్రీ బందా కనకలింగేశ్వరరావు

పోకడ నూతనము, నాటక సాహిత్యమున కమూల్యాలంకారము, కళాసంపద రసజ్ఞులకు విందు (1945).

13. శ్రీ పండిట్ రావు

దానిని నాటకములు చదివినప్పుడు పొందిన ఆనందమే పొంద గలిగితిని. నాటకమంతయు కళామయమగుటచే కళాసిద్ధులైన నటుల చేతనే యిది ప్రయోగార్హము (1945).

14. శ్రీ బి. వి. నరసింహారావు

విద్యాసంస్కారం, కళాకౌశల్యం ఉన్న నటులుకాని ఇట్టి నాటక ప్రదర్శనానకి తగిన న్యాయం చేకూర్చలేరనుట నిస్సందేహం. సాంఘిక నాటకాల అవసరాన్ని గుర్తించిన యీనాడుకూడ ఇట్టి నూతన పంధాలో రచింపబడిన పురాణగాథనైనను ఆంధ్రుల ఆదరాభిమానాన్ని చూరగొన గలడనడం అత్యుక్తికాదు. ఈ సృష్టికి నా ధన్యవాదాలు (1945).

# కృతజ్ఞత



౧. బాణాసురుడు : శ్రీ వేమూరి రామయ్య

౨. అనిరుద్ధుడు : శ్రీ రామచంద్ర కాశ్యప

౩. నారదుడు : శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రి

౪. శంకరుడు : శ్రీ కోడాలి చంద్రమౌళీశ్వరరావు

౫. కృష్ణుడు : శ్రీ బందా కనకలింగేశ్వరరావు

౬. బ్రహ్మ : శ్రీ కాటూరి విజయసారధి

౭. కుంభాండుడు : శ్రీ వింజమూరి శివరామారావు

౮. ఉషాసుందరి : కుమారి రాజ శారదా కుమారి

౯. చిత్రరేఖ : కుమారి పోలవరపు శారద

౧౦. రాణి : శ్రీమతి తెన్నేటి హేమలతాదేవి

(13-8-57న ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ఒక గంట నాటకముగా పై వారిచే ప్రసారము కాబడినది. కృతజ్ఞుడను.)

# నాంది

శ్రీ॥ శివా శారదా రాగ సిక్తములగు
హరి హర హిరణ్యగర్భ హృత్సరసిజములు
మధుర మధురంపు తావి సంపదల పొదలి
విశ్వకల్యాణ రోచిస్సు విస్తరించు.

(సూత్రధారుడు ప్రవేశించి)

సూత్ర : నటీ ! నటీ !

నటి : ఇదే ! వచ్చితిని. బావా ! కల్యాణమని వినవచ్చినది. వివాహ మెవరిది ?

సూ : అది ప్రార్థనాశ్లోకము. దంపతి తాంబూలము వృథా యగుననుకొంటివా ?

నటి : అది మాత్రమేది ? పెళ్ళియన నాకెంతో సరదా ! దంపతి తాంబూలము పుచ్చుకొనువేళ మీరు లేనందుకు నా ప్రాణము చివుక్కుమనినది. మొన్న మీరు మావారింటికి రానేలేదు కదా !

సూ : అబ్బ ! ఏమ్మా! పోనీ నీవైన చేయించి వచ్చితివి కదా! బాగుగా జరిగినదా ?

నటి : ఆ! ఏదో! జరిగినది. మూడుముళ్ళు పడునప్పటికి గగనమైనది.

సూ : అదేమి ?

నటి : పెళ్ళియన్న ప్రక్కనే విఘ్నముండును. ఏ పెళ్ళియు పూర్తియగువరకు అయినదనుకొనుటకు వీలులేదు. ఎచ్చటనో పేచీ తప్పదు.

సూ : పరిణామ సుఖమున్న ప్రక్క విఘ్నముల కేమిలే.

నటి : బావా ! ఈ నాటి నాటకమేది ?

సూ : పెండ్లినాటకమే కావలెనా ?

నటి : తమకక్కరలేనట్లు! సభ్యులు వేచియున్నారు. త్వరగా సెలవిండు.

సూ : చూడు మీ చిత్రపటము; విరహిణి ఉషస్సుందరిని అనిరుద్ధ తేజస్కుఁడహస్కరు డాశ్లేషించుచున్నాడు. ముద్దరాలు కౌగిలిలో కరగిపోయినది.

నటి : ఓహో ! ఉషాసుందరి నాడదలచితిరా.

సూ : ఇది శ్రీ సుబ్బరామశాస్త్రి రచన.

నటి : తెలియును. పరిషత్తు మెచ్చిన కదా తమరు నాతో మాట్లాడుట! ఏమా దివ్యగానము! అప్పుడే దేవఋషి నారదుడు ప్రవేశించినాడు. మనమిక్కడ తడయరాదు.

(నిష్క్రమింతురు)

— ఇది ప్రస్తావన —



# ఉషాసుందరి

## ప్రథమాంకము

### ప్రథమ రంగము

(తెరముందు)

నా జనకుఁడు హిరణ్యగర్భుఁడు విష్ణుని కుమారుఁడే కదా! శైవులును వైష్ణవులును పరస్పరముఖావలోకమునే గర్హింతురు. నా కిరువురు నొక్క-రూప. ఈ భేదము లోకమున నేల కలిగినది? ఇంగితమేల లుప్తమైనది? ఆ మహా మూర్తులును ఒకప్పుడు తమతమ క్రియావిశేషములచే నాధిక్యాభిమానము నంతరాంతరము లందైనఁ జెందకయుందురా? వారి వారి జాక్షులకిది సహజమే కదా! అబ్బా! ఈ యుబ్బు నేను పట్టలేను. ఒకతూరి శివకేశవులు నిర్ణయించుకొనిన నేను చూడవలయును. తత్వానంద భంగకరమగు నీ యూహ నాకిప్పుడేల కలిగినది? హా విధీ!...

(తెర యెత్తుదురు)

ఉష : కాని—అంతిమ విజయ మాతనిదే కదా?

చిత్రరేఖ : అవును, అతఁడు మాయలమారి.

ఉష : చిత్రా! నావంక చూడుము. మాయలకుఁ బెట్టినపేరు మనమా? దేవతలా! మాటవరుస కందును. నీ దగ్గర నున్న శక్తులు దేవతల దగ్గర సైత మున్నవా? కాదు చెలీ! దైవము వారిసొమ్ము.

చిత్ర : ఉషా! మన దైత్యులంతయు సక్రమముగనే చేయుదురు. కొట్టకొస కేదో తెలివితక్కువపని చేయుదురు. దానితో క్రుంగి పాతాళమునకు పోదురు.

ఉష : రావణుడు బ్రహ్మ యంతవాని మనుమడు, మహాశివభక్తుడు, రాజ్యపాలనా ధురంధరుడు కద! చివరకు నరునిచే నోడిపోయెను కద!

చిత్ర : ఇంటిగుట్టు లంకకు చేటయినది. ఆ తెలివితక్కువతనము రాముని కవకాశమైనది.

ఉష : అంతియే కాని దోసమంగీకరింపవు. పతివ్రతామతల్లిని రావణుడు చెరపట్టుట యుక్తమా చిత్రా! ధర్మము జయించె ననుకొనఁగూడదా? చాటునకైన సత్యము పలికిన నష్టమేమి? మనవారికి శక్తులు కలిగిన వెంటనే దుర్వినియోగముఁ జేయుదురు. మనలో నే మహిమాన్వితునికి తొలి కబళముగా నింద్రుడు కాలేదు? పాపమింద్రత్వ మతనికి భోగహేతువు కాదు; శిక్షాహేతువు. అతడు తిన్న మొట్టికాయల కంతులేదు.

చిత్ర : సుందరీ! ఏమిజాలి! మనము వారినెంత పూసికొని తిరిగినను మనజాతి నణగఁద్రొక్కుటయే వారి నిర్ణయము. మందర పర్వతముఁ దెచ్చుటలోనేమి, వాసుకిని పడగవద్ద పట్టుటలోనేమి సర్వక్లిష్ట పరిస్థితులలోను మనములేనిదే యమృతము రానేరాదు కదా! ఇట్టి సేవం జేయించుకొని కుత్సితులై – కృతఘ్నులై – మనకు పాలీయక–ఇదియేనా వీరి ధర్మము. ఈ ధర్మము నీకే నచ్చవలెను.

ఉప: నీవు చెప్పినది నిజమే. కాని మనవారేల మోహినిని జూచి భ్రమపడవలె? అదియునుగాక సముద్రమథనమునకుఁ బూర్వము మనవారెంత లోకకంటకముగఁ బ్రవర్తించినారు. మనకు ప్రజాసానుభూతియున్నదా? తపస్సు చేసితిమా, శివుడు చానిస యగువరకు చేయుదుము. వ్యయింప మొదలిడితిమా, సర్వలోక సంక్షోభము చేసికాని వదలము. లేకున్న జలంధరుఁడు పార్వతినికోరుటేమి? భస్మాసురుని వరమెట్టిది? మనము మనకు వరమిచ్చిన శివునే చెరుప యత్నింపలేదా? మూర్ఖత పతన హేతువుకాదా?

చిత్ర: నేను మనవారిని బుద్ధిమంతులనలేదు. వారును బుద్ధిమంతులుకారు. 'దైత్యారి' యను నామమేల కృష్ణుఁడు ధరింపవలెను! ఈశ్వరుడును బ్రహ్మయును మనల ననుగ్రహింతురు. ఈతఁడో ప్రమందించును.

ఉప: చిత్రరేఖా! మూర్తులు ముగ్గురు నొక్కటే. ఒక దేవర మనకనుకూలుడనియు నొకఁడు వ్యతిరేకియనియు తలంచుట వెఱ్ఱి. జలంధరసంహారమునకు విష్ణువు సాయపడలేదా? విష్ణువునకు లక్ష్మినిచ్చి శంభుఁడనితర ధార్యమైన గరళ మారాచమింపలేదా? శివుఁడు పొగడిన నుబ్బును. విష్ణువు నిదానించును. ఇవి వీరి ప్రకృతులు; కాని తత్త్వమొక్కటే.

చిత్ర: నాకా విశ్వాసములేదు. ముక్కంటి దైత్యుల పాలిఁటి పెన్నిధి. అతఁడండయే నైనచో భండనమున కృష్ణు జేసాటి!

ఉష : చక్ర త్రిశూలములకు సంఘర్షణమే లేనప్పుడు నీ నిర్ణయ మెట్లు !

(నారదుడు ప్రవేశించును)

ఉష : (నమస్కరించును)

నారద : శీఘ్రమేవ కళ్యాణ సిద్ధిరస్తు.

చిత్ర : స్వామీ! తాము త్రికాలజ్ఞులు. ఇట్టి మా చెలి కెట్టి వల్లభుడు లభ్యమగునో సెలవీయ వేడుకొనుచున్నాను.

ఉష : (సిగ్గుతో చిత్రరేఖను చురుకుగ చూచును).

నారద : రూప జిత మన్మథుఁడు, ననిరుద్ధ పరాక్రముఁడీ పుణ్యరాశి పతి కాగలడు.

చిత్ర : తమ ఆశీః ప్రభావము. మా చెలి యెంత ధన్యురాలు!

నారద : బాణాసురుఁ డెచ్చటి ?

చిత్ర : స్వామీ దివ్యాస్త్ర లాభమునకై మహేశ్వరుని మెప్పించుటకు హిమాలయ ప్రాంతారణ్యములకై తపస్సు చేయఁ జనినారు.

నారద : ఓహో ! ఆతనిఁ జూచి చాలకాలమైనది.

(నిష్క్రమించును)

ఉష : చిత్రరేఖా! ఏమే నీ దుడుకుతనము ? మానుల సమక్షమున కూడనా ?

చిత్ర : సత్వరము ఉషాపరిణయ మగునని వారే యాశీర్వదించిరి కదా.

## ద్వితీయ రంగము

[అంతఃపురము : ఉషనిద్ర, చిత్రరేఖ ప్రవేశము]

చిత్ర : (స్వగతము) నాగమణి గుచ్చిగుచ్చియడిగి విసికి వేసారినది. ఉషాసుందరి నానాటికిఁ గృశించుచున్నది. ఈ రాత్రి యిచ్చట ప్రత్యేకముగ పరుండి వేగుదీయ గలనా ? (పరుండి నిద్రనటించును.)

ఉష : (కలవరించుచు) సెలయేటి రజతప్రవాహమా! ఆహా! వెన్నెల వెలుఁగుల జిలుఁగులు.

చిత్ర : ఆలాపన - సామాన్యమే !

ఉష : పల్కులు కలకండలు.

చిత్ర : వేనివి ? చిలుకలవా ?

ఉష : ఈతోఁటలబాట లెంత వాటములు !

చిత్ర : సాయంవేళ తోటలో విహరించితిమిగదా !

ఉష : మత్తిల్లు నెత్తావు లీ మల్లియలు.

చిత్ర : ఇదియొక రకమైన కవిత్వధోరణి.

ఉష : వలపు లొలకించు నీ జొంపములు.

చిత్ర : జొంపముల జోలియేల ? వలపనును-వలకాక కాదు కదా !

ఉష : మనోహరా! నీవుగట్టిన పూవుల రథమిది.

చిత్ర : మనోహరు డెవ్వరు? ఆహా ! నిక్కముగ నిది ప్రణయ జ్వరమే. ఎంతకాలమునుండి జీర్ణించినది !

ఉష : అది నీ గదుసుదనము...

చిత్ర : ఏమి ? నన్ను కాదుకదా ! ప్రియునిఁగాబోలు !

ఉష : నేర్చితివిలే, చాలు ! ఎవరైనవిన్న నవ్వుదురు !

చిత్ర: నేనొక్కతెనే కదా విన్నది. ! ... అర్థమైనది ; ఇది మదన కృతము.

ఉష : అబ్బా ! ప్రభాతము ! (అని కదలును)

చిత్ర : (బిగ్గరగా) సఖి ! ఇంకను కాలేదు.

ఉష : కాకపోవుటేమి మనోహరా ! అటుచూడుము.

చిత్ర : (బిగ్గరగా) కాదుసుందరీ ! ఇది అర్ధరాత్రము.

ఉష : (కండ్లు తెరచి చిత్రరేఖనుచూచి సిగ్గున తలవాల్చి) నీ వెప్పుడు వచ్చితివి?

చిత్ర : నీ నిద్రలో

ఉష : నాకెట్లు మెలకువ వచ్చినది !

చిత్ర : ప్రభాతమయ్యె ననుకొనుటవలన. లేకున్న సుఖభంగ మయ్యెడిది కాదు.

ఉష : (ముఖము చిట్లించి) సాకూతముగ మాట్లాడెద వేమి ? సుఖభంగమేమి ?

చిత్ర : నిద్ర సుఖకారిణి కదా ?

ఉష : మరి నీవు నిద్రపోయితివా ?

చిత్ర : కలలతో నిద్ర పట్టునా ?

ఉష : నీ కేమి కల వచ్చినది ?

చిత్ర : నేను నిద్రపోయితినట. నీవును నిద్రపోయితివట. నీకు కలవచ్చినదట. "మనోహరా! నీవు కట్టినపూవుల రథ

మిది. అది నీగదుసుదనము! నేర్చితివి లేచాలు. ప్రభాతమైనది." అని ఏమోమో కలవరించితివట! నే "నిది యర్థరాత్రి" మని యేమో యంటినట. ఆ మాటలే బిగ్గరగా వచ్చినవి కావలయును! మెలకువ వచ్చినది. నేను లేచునప్పటికి నీవును లేచితివి. నిద్రలో నిద్ర! సఖి! కల నిజమైనది.

ఉష : (తనలో) కల నిజమైనదా? మంచి ఉపశ్రుతి. (బిగ్గరగా) నీవు చిత్రకారిణివే కాదు. కవయిత్రివి కూడ.

చిత్ర : రాణి నీ కృశించుటకు గారణ మరయ జాలకున్నారు.

ఉష : నేనంత చిక్కితినా?

చిత్ర : సగమయితివి.

ఉష : సర్వమును తెల్లమైనది కదా!

చిత్ర : శిరస్సు లేని శరీరము,

ఉష : అదేమి?

చిత్ర : నామధేయము బయల్పడలేదు కదా!

ఉష : నాకు మాత్రమేమి తెలియును?

చిత్ర : పేరు చెప్పుటకు కళ్యాణ సమయమున సిగ్గుపడిన సరియగును. ఈ చెవిలో... రహస్యముగా...

ఉష : నే నన్నృతమాడనని చెప్పకొనవలయునా? చిత్రరేఖా!

చిత్ర : పోనిమ్ము. ఆతఁడే దేశమున కేలిక?

ఉష : ఒకటి తెలిసిన రెండవది తెలియుట సులభమే.

చిత్ర : ఏమి యీ చిత్రము సుందరీ?

ఉష : చిత్రాతి చిత్రము చిత్రరేఖా!

చిత్ర : సమాగమ మెచ్చట సుందరీ ?

ఉష : స్వప్నగత వసీ నికుంజమున.

చిత్ర : ఎట్టివలపుచే సొలసిపోయితివి సుందరీ! (అని నవ్వును)

ఉష : నవ్వుల రువ్వి యెద నదలింపకుము. ఆతని విలాసములు (అని అర్ధోక్తిలో విరమించును).

చిత్ర : కావ్యవస్తు వోకానొకటఁ గల్పితమగునట్లే యాతఁడును స్వప్న గతమూర్తికదా! సృష్టిలో నుండి యుండవలయునన్న నియమమేమున్నది ?

ఉష : ఇందేదియో దైవనిర్దేశమున్నది. లేకున్న ప్రతి రాత్రము నదే రూపమున స్వప్నమున - నాతో విహరించుటేమి ? నీవును నేనును మాటాడుకొనుట యెంత సత్యమో యది యంతకన్న పరమ సత్యము. చిత్రా ! నన్ను వెల్లడి చేసెదవా ?

చిత్ర : నీ ప్రాణసఖ చిత్రరేఖ, మంత్రి కుంభాండుని పుత్రిక. నా శరీరము నీ సుఖమునకే నిర్మితమైనది.

ఉష : రేఖా ! నా ప్రాణమునకు నీ కళాపాటవమే యాధారము.

చిత్ర :

చెలువ ! నీకన్న నేమికావలయు నాకు
అసురజాతికి మఱి యసాధ్యంబు కలదె !
ఇట్టి సంకల్పబలము రూపెత్తకున్నె ?
ఇదె ప్రయాణము మదవతీ! యెఱుఁగుమమ్మ.

దిగ్దేశ రాజన్యుల చిత్రములచే నీ యంతఃపురము నలంకరింపఁ జేసెదను. నాతూలికతో నీయేలికను నీ కన్నుల యెదుట నిలిపెదను. పదపడి తదుపరి కార్యక్రమము.

ఉష : భవానీ! మమ్ముల ననుగ్రహింపుము.

(చిత్రరేఖ నిష్క్రమించును)

చెలువము నీదిరా ప్రణయసీమవు నీవుర, ప్రాణవల్లభా
కల నగుపించి, తీయని నిగారపు సూరిమి సంతరించి, యూ
యల, మరగించినట్టి కళలే కలవై నవి, మేలుకొల్పులన్
వలపుల పిండినట్టి ప్రభువా ! కరుణింపుము దోయిలించెదన్.

వలపులరాయడా ! మొదదువారము నీకయి తీసియుంచితిన్
సలసల క్రాగు వెన్నెలలజాలులె నాపయి దండడించెడున్
నిలువగ లేనురా యిటుల, నీకడగంటి కృపాప్రసారముల్
చిలికెదవా సుధల్ మధురసీమల కోమల పుష్ప శయ్యలన్

(చిత్రరేఖ ప్రవేశించును)

ఉష : వచ్చితివా నాప్రాణ సఖి చిత్రరేఖా !
చిత్ర : సుందరీ ! ప్రాణము లేచి వచ్చినట్లున్నదే !
ఉష : నియతకృత్యములందు కృతార్థురాలవై తివి కాబోలు!
చిత్ర : సుందరీ! దెందము పదిలపరుచుకొనుము.
ఉష : చిత్రా!కన్నులు కఱవుతీర నీకళానైపుణిని చూడగలవు.
చిత్ర : అవును. నీవాంఛితార్థమును చూడగలవు.
ఉష : చమత్కారిణివి చిత్రరేఖా.
చిత్ర : ఊర్ధ్వలోకవాసులను తొలుత చూపుదునా ?
ఉష : [అంగీకారమును సూచించును.]
చిత్ర : గంధర్వకిన్నర కింపురుషులందురే, సంగీతకళాకోవిదులు—వారే వీరు.
ఉష : అటులనా ?

చిత్ర : (ఉషముఖమునుచూచి పుట తెఱచి) యావ్వన యథేచ్ఛావిహారులు సిద్ధసాధ్య చారణ గణమిదే.

ఉష : ఓహో.

చిత్ర : సౌఖ్యసంపదుపేతులు, మరుత్తులను యక్షులను వెందువ్రకదా. చూచితివటమ్మా వీరిని ?

ఉష : చూచితిని.

చిత్ర : వీరు కామరూపులైన పన్నగులు సుందరీ.

ఉష : సరే.

చిత్ర : నీ హృదయ సామ్రాజ్యాధిష్ఠానము మర్త్యమలోక స్థితమా ? చూడు సారసాక్షీ ! వీరు మాళవ నేపాళ బంగాళ పాంచాల దేశాధీశులు.

ఉష : ఆ !

చిత్ర : వీరు కొంకణ టెంకణ త్రిగర్త సుదేష్ణ మరాటలాట దేశాధీశులు.

ఉష : ఊ హూ !

చిత్ర : వీరు కురు బర్బర సింధుయుగంధ రాంధ్ర కరూశ నిషాద ఘూర్జర సాళ్వ భోజ దేశాధీశులు.

ఉష : ఓహోహో !

చిత్ర : కాకుండిన వదలివేయుము. పరిహాసమేల ? మగధ దేశాధీశ్వరుడు— ఈతని ధాటి కృష్ణునికి బాగుగా తెలియును. ఎంటివికదా బృహద్రథసుతుని జరాసంధుని—చూడుమమ్మా ?

ఉష : బాగు బాగు.

చిత్ర : యుద్ధ కుశలి, భీష్మకసుతుడు విదర్భాధీశ్వరుడేమైన కలలోనికి వచ్చెనా ?

ఉష : ఇప్పుడు చూచిన కలలోనికి వచ్చునట్లే యున్నాడు.

చిత్ర : ఈతనికి విశేషించి సైన్యమును పరాక్రమమును కలదు. ఈశ్వరుని మెప్పించి శూలమును సంపాదించెను. ప్రాగ్జ్యోతిషాధీశ్వరుడు భగదత్తుడందురే.

ఉష : తరువాతి పుట—

చిత్ర : పేరు వాసుదేవుడు. ఈతనికి చక్రాబ్జ గదాది చిహ్నము లున్నవి. కృష్ణుడన్న మచ్చరించి మండి పడును. పౌండ్రకుడీతడేసుమా !

ఉష : అవును. బురదపాము పామే. (నిశ్వసించి) ఏమి— రేఖా! పటములన్నియు నయినట్లున్నవే ?

చిత్ర : సుందరీ ! సత్యసంధులు భుజావిక్రములు విజయోపేతులు పంచపాండవులనుఁ జూచితివా ?

ఉష : చూచుచునే యున్నాను.

చిత్ర : రాజరాజు, దుర్యోధనుని చూచితివా ?

ఉష : ఈ యదువులు నిలువవా ?

చిత్ర : చూడుసఖీ! ఈతడు బలరాముడు. ఈతడు కాడు కదా !

ఉష : కాడుసఖీ ! ఈ కల నాకేల రావలయును ?

చిత్ర : ఈతడు కృష్ణుడు సుందరీ! ఈతడేమైన ?

ఉష : కాడు సఖీ. కాడే ! అబ్బ ! !

చిత్ర : రుక్మిణీసుతుని ప్రద్యుమ్నుని చూచితివా సఖీ.

ఉష : (పరీక్షగాఁ జూచుచు నిశ్వసించి) రేఖా! కొన్ని పోలికలున్నవి. కాని యాతనిగా నేను నమ్మలేను! (సిగ్గుతో) నా మనోహరు డదియొకవిధముగా నుండునే చెలీ!

చిత్ర : అయిన నిది చూడుము. (అని పుట ద్రిప్పును)

ఉష : (చిత్రరేఖ కన్నులలో చూచి) రేఖా! రేఖా! రేఖా! (అని పటమువంక చూచి హృదయమునకు హత్తుకొనును. మరల తెఱచి యదేపనిగాఁ జూచును).

చిత్ర : నన్నుపిలిచి చిత్రమును కౌఁగిలించుకొనుటేమి సుందరీ!

ఉష : చిత్రరేఖనే కౌఁగిలించుకొనవలెను. రా! సఖీ! నిన్నే కౌఁగిలించుకొననిమ్ము. (అని కౌఁగిలించుకొని వదలి) ఆర్యపుత్రుని నామధేయము రేఖా!

చిత్ర : ఎదపదిలించుకొంటివికదా! ఆతనినే యడుగుము చెప్పును.

ఉష : నీవు ప్రాణ ప్రతిష్ఠఁ జేయుము. అట్టులే యడిగెదను చెలీ! నాకూరిమికాని పేరు ?

చిత్ర : ఏమో!

ఉష : ప్రాణసఖీ! బ్రదికింపుము. వీనులు మనోహర నామ సుధారసమునకు దప్పిగొనియున్నవి.

చిత్ర : చెప్పిన నా కేమిచ్చెదవు సుందరీ ?

ఉష : రేఖా! ఇచ్చుటకు నీదికాని దేది ? మెచ్చెదను చాలదా? గ్రుచ్చి కౌఁగిలించెదను. చాలునా?

చిత్ర : అబ్బా! ఎంతచేసెదవు?

చెలియ! అంతంత కోకవింత చెలువ మొలికి
కల, నిగారపు వలపులఁగలియఁబోసి
తొలుతనే లేత నీ యెద దోచినట్టి
యాత డనిరుద్ధు డమ్మ-విద్యామహస్వి.

ఉష : అయిన కృష్ణునికి.

చిత్ర : అవును-పరాక్రమవంతుఁడైన పౌత్రుఁడు.

ఉష : సఖి! అతఁడెట్లు మనకు...

చిత్ర : (నిస్పృహతో) కష్టమే.

ఉష : నీవే యిట్లనిన చిత్రరేఖా!

చిత్ర :సుందరీ! నీ జనకుఁడేమైన నిచ్చగించునా? కృష్ణుఁడు దైత్యారికదా! ఇది స్వప్నప్రాయమే యగును.

ఉష : స్వప్నప్రాయమైన సుఖాంతమే.ఇది జరిగితీరవలసినదే, లేకున్న...

చిత్ర : ఎట్లుసుందరీ?

ఉష : ఉషాకుమారి యిక లేనిదేనా? (అని ఏడ్చును).

చిత్ర : ప్రాణసఖి! నీ బాష్పధారను నేను చూడలేను. నా శక్తిని నీకు ధారపోసెదను. తదుపరి యేమయినను సరే! చెప్పుతిల్లుము.

ఉష : మనోహరా! (అని పరధ్యానమున నుండును.)

చిత్ర : ఊఁఅడిల్లుము సుందరీ! నీమనోహరుని తెచ్చెదను.

ఉష : తెచ్చెదవా రేఖా! నీవేనా యనునది. ఆహా! నీవు తేఁగలవు. కాని యెట్లు తేఁగలవు?

చిత్ర : యోగవిద్యా ప్రభావమున నిద్రాముద్రితునిఁ జెక్కు-చెదరకుండ దీసికొని రాఁగలను.

ఉష : నిజముగా ! నా చిత్రరేఖా ! తీసికొని వచ్చెదవా ! ఏదీ, యిటు చూడనిమ్ము. (అని కన్నులలో చూచి) నిశ్చయముగా నీ కనులు తీసికొని రాఁగలిగినట్లే యున్నవి.

చిత్ర : రహస్యముగ నంతఃపురములో నాతని దాఁచవలెను. ఇది బయల్పడిన నేమగునో తెలియునా ?

ఉష : పోమ్మ, ప్రాణసఖీ ! పోమ్మ. (చిత్ర నడుచును.) రేఖా ! 'త్వరగా' యూతనిఁ దెచ్చిన నాతడు నన్నొల్లనను మాటేమి ?

చిత్ర : నిన్నుఁ గాదను పురుషులును కలరా ?

రసము లొలికించి బులిపించు రాజసంపు
తళుకుబెళుకుల నాలుఁ జూపులకు కరగి
పరవశమ్మయి పోలని వాఁడు కలడె ?
పలికెదవు గాక గోలవై కలత నెలత !

ఉష : పోమ్మ ప్రాణసఖీ ! పోమ్మ. అడుగులు మఱియింత వేగముగా ...

( నిష్క్రమణము )

# ద్వితీయాంకము

## ప్రథమ రంగము

[ బాణుని తపస్సు ]

నారద : ఈ తపోదీక్ష యెవ్వరిది? శోణాధీశ్వరా! బాణా!

బాణుడు : ప్రణాములు దేవమునీ!

నారద : అరివీరభయంకర సహస్రబాహావిక్రమ శోణాధీశ్వర బాణాసుర సార్వభౌముఁ డీ కాఱడవి నే ప్రయోజన మర్థించుచున్నాడు.

బాణ : బ్రహ్మమానస పుత్రులు, త్రికాలజ్ఞులు తమకు తెలి యని దేమున్నది?

నారద : (ఆలోచించి) దివ్యాస్త్రలాభమా! ఈ నీ తపోగ్నికి ముల్లోకములు నల్లాడిపోవుచున్నవి. శంభుఁడేల ప్రస న్నుడు కాలేదు? (మరల నాలోచించి) బాణా! నీ తపస్సు ఫలించినది. నిముసములే యంతరము.

బాణ : దేవమునీ! తమ యమోఘాశీర్వాదము. గారాబు పట్టి ఉషాకుమారిని వదలి, పరాక్రమోపేతులు పుత్రులను విడచి యీ శరీరము కృశింప నీశ్వర దత్తములైన సహస్ర బాహువులతో సంవత్సరము లుగా శివార్చనము జేసితిని. నేటికిని స్వామికిఁ గరుణ కలుగలేదు.

నారద : బాణా! నీ పట్టుదల దిట్టమైనది.

బాణ : నారదమునీంద్రా! మీ తండ్రిని మెప్పించిన మా కుదుటివాడు హిరణ్యకశిపుని కార్యదీక్ష మెట్టిది, పొందిన వరము లెట్టివి? అవి నిష్ఫలములు కాలేదా? వైకుంఠమును జయించవలెనను యభిప్రాయము నాకు లేదు. కాని యేనాటికిని విష్ణువు మా దైత్యులను బ్రతుక నీయడు. నిజము చెప్పుము; సముద్ర మథనమున శ్రమ మెవరిది, ఫలితమెవరిది? దేవతలు రాక్షసులకు న్యాయమే చేసిరా?

నారద : బాణా! నేను దేవమునిని కదా!

బాణ : అయినను మీయందు మా యసురజాతికి విశ్వాసము కలదు. తమను మాయందట్టి యభిమానమే కలదు.

నారద : బాణా! మీ తండ్రి బలిచక్రవర్తి దానధురంధరుఁ డని పించుకొనుటకు పాతాళమునకు దిగద్రొక్కబడు టేమి? ధర్మవిరుద్ధము కాదనియు, చిన్ని యబద్ధమాడిన సర్వము నిలుచుననియు, నది విష్ణుమాయయని విస్తరించి మొత్తుకొనినను ఆచార్యుఁడనియు శుక్రుని వినక మూర్ఛించెను. అట్టి పరిస్థితులలో దేవతలేమైనచో-

బాణ : నిజము నారదమునీంద్రా!

నారద : ఒక తండ్రి బిడ్డలము, కయ్యమేలనయ్యా యని మొత్తు కొందును. ఇరుపక్షములును వినరురా? విష్ణువు నా పితామహుఁడనియు నే నాతని కీర్తింతుననియు మీ వారు నమ్మరు. నే నుసన్న చున్నట్లు చెప్పిన కలహ శీలినని మా వారు దూషింతురు.

బాణ : దేవమునీ ! తమరు మాకును కావలసినవారు. దైత్యులకీ యెద్దడి తప్పు నుపాయము నుపదేశింపరాదా!

నార : ఏమి యుపాయము కావలెను ?

బాణ : శంభుని వరము వేడవలయునుకదా !

నార : సత్యము. కాని మీ పూర్వులు వరము వేడుటలో నొక్కొక్కరియం దొక్కొక్కదోసమున్నది. హిరణ్యకశిపుడు పగలును, రాత్రియు; నరునిచేత, మృగముచేత; భూమిని,యాకసమున; జీవము కల, లేని పదార్థములచేతఁ జావగూడదని చాలవఱ కాలోచించి వరము వేడినాఁడు. విష్ణువు, సంధ్యాకాలమున-నరసింహుడై భూనభోంతరాళమున-నఖములచే-జీల్చిచంపెను. ఇట్టి యవకాశమునకు స్థానములేనిదిగా వరమును కోరవలయును. నీబుద్ధికి నీవే యాలోచించుకొనుము. నేను పోయెదను.

బాణ : దేవమునీంద్రా ! అట్టి యుపాయము నాకు తోచుట లేదు. తమరే సెలవీయవలయును.

నార : ఇదియేమి యన్యాయము బాణా ! నేను చెప్పిన బాగుండునా ? ఈశ్వరుఁడేమనుకొనును ? విష్ణువేమనుకొనును ? నేను పోయెదను. [అని పోఁబోవును.)

బాణ : తమ పాదములకు మ్రొక్కెదను. వెల్లడింతునా దేవమునీ! రహస్యముగ నుపాయము సెలవిమ్ము. [అని పాదములఁ బట్టుకొనబోవును.)

నార : బాణా ! నీ తండ్రి బలిచక్రవర్తి విష్ణుని 'కాపలా' యుంచుకొనినాఁడు.

బాణ : (నిశ్వసించి) చక్కని యుపాయము. దేవమునీ ! ఆజన్మాంతము నీకు కృతజ్ఞుడను. త్రిశూలధారి నా రక్షయే యైనచో చక్రము చక్కిలమే. కాని మునీ ! ఇది యపరాధముకాదా ? పరమేశ్వరు నట్లు కోర వచ్చునా ?

నార : ఇందులకే నేనేమియు నింతవఱకు చెప్పలేదు. ఇప్పుడునుఁ జెప్పలేదు. నారదుని నెత్తిన నభాండము వేయుట సులభము. శోణాధీశ్వరా! పోయివచ్చెదను.

బాణ : దేవమునీ ! క్షమింపుము. నేను సందేహముకలిగి ప్రశ్నించితిని.

నార : పిచ్చివాఁడా! భగవంతుఁడు భక్తపరాధీనుఁడుకదా ! భక్తరక్షకుఁడుకదా ! అంతకన్న కోరునదేమున్నది? నీవేమి గర్వముతో విఱ్ఱవీగెదవా ?

బాణ : ధన్యోస్మి.

(నారదుఁడు నిష్క్రమించును)

[బాణుఁడు తపస్సులో కన్నులు మూసికొనును. శివుఁడు తాండవమొనర్చును]

బాణ : (కొంచెము కదలి) ఏమి యీ యపూర్వ సౌరభము? సమాధిని నిలువనీయకున్నదే. (నిశ్చలుడు)

శంక : బాణా !

బాణ : (మఱల కదలి) ఏమి యీనాఁడీ విచ్ఛిత్తి! ఇంద్రుఁడు మాయపన్నెనా ? (నిశ్చలుడు)

శంక : బాణా !

బాణ : [కదలి] ఏమి యీ రసధ్వని ?

శంక : బాణా ! అనుగ్రహింపబడితివి.

బాణ : స్వామీ! నేను సమాధిలో లేను. తమ రూపము!

శంక : చర్మచక్షువులతో చూడగలవా !

బాణ : శివానుగ్రహ పాత్రుఁడను కదా !

శంక : బాణా! [హస్తముతో మంత్రించును]

బాణ : [కన్నులు నెమ్మదిగా తెఱచి] మహాదేవా, ఎంతకాలమునకు! చెదరి యుంటిరి. ప్రభువులు సంధ్యా నృత్య మొనర్చిరా? ఈ సహస్ర బాహువులు పునీతములుఁగా వీవనలుపట్టనా ? [అని వీచును]

శంక : బాణా ! నీ భక్తి నిరుపమానము.

ప్రతి నిమేషము నొక లక్షపత్రిపూజ
రాసులమ్యోను, తుమ్మిహారములు సతము
అగు ప్రతి దిన సహస్ర ఘటాభిషేక
మిట్టి భక్తాగ్రణికి నెవ్వరీడు నీకు.

బాణ : జటా మకుట పినద్ధ శశి ప్రహ్లాద పరసీమ. గరళస్థ హాలాహల రోచిర్నిరస్త హారి నీలమణి. స్వస్రోతసీ తరంగములు హృష్టాంతరంగములు. ప్రస్తవిన్యాసఫణి మణి సజీవాలంకారము.

శంక : బాణా ! నీ వాంఛితము ?

బాణ : ఇట్టి సుందరమూర్తి నంతరంగమ్మున సర్వదా బంధించు ప్రదక్షిమ యీ బాణునికడ మృగ్యము. మహాదేవా! నేత్రోత్సవముగా-భక్తపరాధీనుఁడవు కదా! భక్తరక్షకుఁడవు కదా! నానగర ప్రాంగణమున నాకు రక్షగా నుండుము.

శంక : తథాస్తు. కాని దైత్యులలో నీవు మాత్రమే చూడ గలవు. [చేతులెత్తి యాశీర్వదించును.]

(తెరపడును)

## ద్వితీయ రంగము

(దృశ్యము - కోట)

బాణ : శంకరా! నిన్నువిడచి నేనొక్క నిముసమును మన జాలకున్నాను. నానాటికి మన బంధము దృఢమగు చున్నది. నీవు నాకు ప్రాణమిత్రుఁడవు కదా!

శంక : (తనలో) ఈ భక్తుఁడు సమాన ప్రతిపత్తితో మాటాడు చున్నాఁడు. (ప్రకాశముగా) సందేహమేమి?

బాణ : యుష్మద్దత్త సహస్ర బాహా సంపత్తి సమూల హిమాచలో త్పాటన శక్తికలది.

శంక : (తనలో) ఈతనికి నానిలయమునే పెల్లగించు నూహ కలిగినది. (ప్రకాశముగా) బాణా! నీ వంత పటిష్ఠు డవే యగుదువు.

బాణ : శంకరా! నా బాహాపరిభూతము లీ ముల్లోకములు. అస్మద్భుజాటోపమునకు తగిన పనిలేదు. (విచార ముతో) ప్రతివీరుఁడు లేఁడుకదా!

శంక : (తనలో) ఈ భక్తుఁడు కించిత్తు గర్వించుచున్నాఁడు. (ప్రకాశముగా) బాణా! నీ యైశ్వర్యము నాకు ముదా వహము.

బాణ : శంభూ ! నీవు నా నగరమునకు రక్ష. నే నిడినది లోకమునకు భిక్ష. అస్మద్భుజా కండూతి నానాటికి హెచ్చుచున్నది. ఇట్టి నాపరాక్రమము వ్యర్థమైపోవల సినదేనా ? మిత్రమా ! నీవైనఁ బోరాడరాదా ?

శంక : బాణా ! ఏమనుచుంటివి ?

బాణ : (వికటముగ నవ్వి) దివస్పతివలె జటాజూట ఘటిత శశాంకుడు గజగజలాడుచున్నాడు. అమ్మవారడలి పోవుచున్నది. నేనంతమూర్ఖుడనా ? నిగ పూవు కందనీయను. అర్ధశరీరమంటను. శంకరా ! వినోద ముగా బోరాడుదము రా !

శంక : (త్వరితముగా) వలదు బాణా !

బాణ : శంకరయ్యా ! ఇంత భయపడెదవేల? నెత్తిన నోరు పెట్టుకొని సెలుగుచున్నది; గంగాదేవినికూడ ముట్ట నులే. నా యుద్ధలాఘవము చూతువుగాని, పోరాడు దువు రా.

శంక : బాణా ! వలదు. వలదు. వలదోయీ.

బాణ : నీవు సగమాడుదానవు. నా నగరము నెట్లు రక్షిం తువు ? శంభయ్యా ! రావయ్యా. నీ యొకలిపై పురుగునుఁగూడ ముట్టనులే !

రారా శంకర మల్లయుద్ధమునకుఁ, రావేమి రా శంకరా
పోరన్ భీరుఁడవై తివేమిర మృడా, పోలోవు నీ బీరముల్
రారా నా భుజశక్తిఁ జూచెదవు, లేరా పౌరుషమ్మెక్కడో యీ
రోరీ శంభుఁడ! ఏమికావలెనురా యుల్లోక బాహోద్ధతుల్.

శంక : (కినిసి) రాక్షసుడా! నీవెవ్వరితో మాటాడుచుంటివి? ఒడలు మత్తెక్కి రెచ్చిపోవుచుంటివి. కారులు ప్రేలెదవా? ప్రగల్భములాడెద వేమికరములు! కరములట! కరములు!

ఈ నాడిట్టుల కండకావరమునన్
ఏ బాహుసంపత్తిచే
బాణా! రెచ్చితో, ఆ భుజమ్ములను
నిర్వర్తించు, నొక్కండుగా
నీ నాయంతటిమేటి - యంతపని
నేనే చేయగాఁజాలుదున్
కానీ - వృక్షమదెట్టిదైన నటుకంగా
రాదు, తాఁబెఁచుటన్

నీ కేతన పతనమే భుజా ఖండనమునకు నాంది.

బాణ :

ఏమీ! సరసము విరసమైనదా!
అతి పరిచయముచే స్వతంత్రించితినే
తారతమ్యము గుర్తింపనైతినికదా!
ఏమిచేసితిని - అజ్ఞానమావరించినదా?

విఱ్ఱవీఁగితినికాబోలు!

స్వామీ! స్వామీ! స్వామీ!
అపరాధము, అపరాధము, అపరాధము.

(తెర బడును)

—•—

# తృతీయాంకము

## ప్రథమ రంగము

[ అనిరుద్ధుడు నిద్రలేచును. అంతఃపురములో నాశ్చర్యముతో ]

సరసఁ జెలిలేదు – వజ్రసుందిరము ? కాదు
ఎఱిగినది కాదు పో, యలంకరణ సరణి
పరువులెత్తెడు సౌధ ప్రవాళ శోభ
స్వప్నమా? కాదు, వ్యత్యస్త సరణి యేల ?

ఇయ్యది ద్వారక కాదు. కారాగారమును కాదు. ఇందలి రహస్యమేమి? (బిగ్గరగా) ఎవరు ?

చిత్ర : ఏమి సెలవు ?

అని : (తనలో) ఏమి యీపె లావణ్యము ? (ప్రకాశముగా) మే మెచ్చట నుంటిమి ?

చిత్ర : అంతఃపురముననే యున్నారు కదా ?

అని : అవును. అనగా

చిత్ర : అనగా శోణపురమున.

అని : (తనలో) ఇది బాణాసురుఁడేలు రాజ్యము. నా మన స్సామ్రాజ్యాధిష్ఠానము నారదుఁడు వచించిన యుషా సుందరికిని నాపై వలపు కలదా ? మేమిచ్చటి కేల తీసికొని రాఁబడితిమి ?

చిత్ర : స్వామీ ! నాకును తెలియుటలేదు.

అని : ఏమి యీ వైచిత్ర్యము ?

చిత్ర : కాకేమి.

పూర్ణవిధుఁ గాంచి వారిధి పొంగులేల
వారిధింగాంచి యూపగ పరువులేల
అందరానట్టి మూరస్థు డతనియందు
పద్మినీకాంత కేల ? విప్పారు నెడద.

అని : ఏమి చమత్కృతి ?

చిత్ర : స్వామీ ! (అని చిత్రముపై తెర తీయును.)

అని : ఏమి యీ నైపుణ్యము. ఇట్టి నా రూపచిత్రము నా యంతఃపురమున నైతము లేదే! బహుమానార్హ కళో పాసకులను మే మెఱుఁగఁ గోరుచున్నాము.

చిత్ర : ఈ దాసురాలు. ఏలినవారి యంతఃపుర మిదియే యేల కాకూడదు ?

అని : (తనలో) అగుటకే కదా తెచ్చినది ! (ప్రకాశముగా) అసుర కాంత లెంతకు తగరు ?

చిత్ర : తగినవారికే కదా యింక ప్రవేశము !

అని : రాగవతీ ! (అర్థోక్తి)

చిత్ర : క్షమింపుడు ... రాజకుమారీ !

అని : (తనలో) ఈమె రాజకుమారి కాదేమి ?

చిత్ర : రాగవతీ ! జాగేల ? ప్రాణనాథునిపై నలుకయా ?
[ఉష వెనుకకు తగ్గుచు ముందరకు వచ్చును.]

అని : (తనలో) ఏమి యీ జగన్మోహన సౌందర్యము !

తరుణి పేరెప్రు వలపు ముందఱకు సాగ
గలికి సిగ్గరితనము వెనుకకును లాగు
ఈ వరారోహ నడలు బెల్లింపు లగుచు
నొరవడిని తీర్చు రాయంచ పక్షిగమనీ. కొమ్మలగ

చిత్ర : ప్రభూ ! అది యెట్టి స్వప్నమో ! మా చెలి యొంటి ప్రాణముతో నిలిచియున్నది కదా !

ఉష : చిత్రరేఖా ! ఏలనే యీ ప్రసంగము.

అని : [తనలో] అహో ! శుకాలాపము !

చిత్ర :

కోయిల కూసినన్ బెదరు కోమలి, తుమ్మెద పిండు రేగినన్
హా ! యని కర్ణరంధ్రముల నంతనె మూసెడు, మందమందమై
వాయువు వీచినన్నుసురు పైపయి లేచినటుండు-నట్టి-నా
ధా! యని సోలిపోవును వ్యధన్ విరిసెజ్జను పూర్ణిమా నిశన్.

అని : [తనలో] నాకు నే నేమనవలెను ? [ప్రకాశముగా] పాపము !

చిత్ర : ప్రభువులకు దాక్షిణ్యమలంకారమే కదా ! చెలీ ! నీ భాగధేయము పండినది.

అని : రాక్షసులయందు దాక్షిణ్యము చెల్లునా ?

చిత్ర : రాక్షసులు ప్రాణులు కారో! సమత్వము సహృదయ లక్షణమని తామెఱుంగనిదే. వరణీయులనే వరించిన మా రమణీమణిని కరుణింపరా ?

ఉష : [తనలో] దుర్గాభవానీ! ఈ యుష జీవించుచో పసుపు కుంకుమలు నీ పాదములపై రాసులుగా పోసెదనమ్మా!

అని : చిత్రరేఖా! అనిరుద్ధ నంతటి వానికి శత్రురాజ మందిరమున సల్లాపము రాజనీతియా? అంతఃపుర ప్రచ్ఛన్న విహార ముదాత్తమా?

ఉష : [చిత్రరేఖ చెవిలో నేదియో చెప్పను]

చిత్ర : ఆర్యపుత్రా! దేవరను కోరి రప్పించినది యుషాసుందరి. యోగబలమున దెచ్చినది యీ దాసురాలు. తమరు మా వాంఛితమును మన్నించుటనుదాత్తమా? ఇందు తమకీర్తి ప్రతాపములకుఁ గళంకము కలుగునా? శోణాధీశ్వరులకుఁ దెలియు నవసర మేమున్నది?

అని : ఒకవేళ తెలియుచో?

చిత్ర : ఈ దాసురాలు తమకుఁ జెప్పదగినదా! తమరు పరాక్రమవంతులు కదా!

అని : చిత్రరేఖా! చాతుర్యశీలమైన వాక్ప్రాధుర్య మాకర్షించుటచే ఇంతవరకు సైరించితిని. చిత్రపట లేఖనా నైపుణీ బహూకృతిగా నంతఃపుర చౌర్యాపరాధమునకై నిన్ను శిక్షింపక విడిచిపుచ్చుచున్నాను. కాని నియోగించిన హేతువున నిస్పృష్టమైన మీ చెలి దండ్యురాలు. ఇందుల కేమందువు?

చిత్ర : అనుట కేమున్నది ప్రభూ! ఒకవేళ నేరముఁ జేసెనే యనుకొందము. అశ్లీల యనవలె; నిజముగా నేరమే చేసినది. విధించు శిక్షను తత్త్వము ననుసరించి

యంతరము ముండవలయునన్నది తమబోంట్లకు జ్ఞాత పూర్వము.

మా యుపాకస్య యతి సుకుమారి యగుటఁ
దాళఁజాలదు బాహు బంధమ్ము గాని;
వలతి వన్నిట - నేమి శిక్షలు విధింతొ
ప్రణయ రాజ్యాధిపతి కింత పలుకవలెన!

ఇక నేను పోయివచ్చెదను.

ఉష : ఇదియేమి యన్యాయమే చిత్రరేఖా! నన్నును తోడు కొనిపోవే. నీకుఁ బున్నె ముండునే!

చిత్ర : రాఁగోరిన నధికానులనే వేడుకొనుము.

అని : రేఖా! మీ చెలికి పశ్చాత్తాపము కలుగునా?

చిత్ర : ప్రభూ! తాము హిమవంతులు (ఉషతో) సుందరీ! నీ పెంచిన రాచిలుక, ప్రాణేశా! అనిరుద్ధా! యను చున్నది. తోడి చెలికత్తెలు విన్న మోసమువచ్చును. దానినిమ్రింగింజల తినిపించివచ్చెదను. పోయివత్తునమ్మా.

(నిష్క్రమించును)

ఉష : నన్నొంటరిని చేసిపోవుచుంటివటే చిత్రరేఖా! (అని పోఁబోవును అనిరుద్ధుఁడడ్డగించును.)

అని : నా సాన్నిధ్యమున నీ వొంటరివెట్లు?

ఉష : ఆగనే! చెలీ! చిత్రరేఖా! అన్న... ఇది యేమే! (పోఁబోవును. అనిరుద్ధుఁడు నిరోధించును.)

అని : నన్నుమాత్ర మొంటరిని చేసిపోవుట యుక్తమా? ఈ రాజ్యములును, భూములును మేమెఱిగినట్టివే!

ఉష : మాటున నున్న బోటీ ! నేరని ముగుదను శిక్షించు టుచితమే ? యనరాదకో !

అని : ఇదియా ! నీ సంశయము. నీబోటి మాటునలేదు. మా శశిముఖులు నేరనివారును కారు. అట్లయినను నేరనిచో శిక్ష యవసరమేకదా? (అని స్పృశించును.)

ఉష : నేను పరవశ నైతిని.

అని : ఇక్షు శరాసనము తునాతునకలై నది.

(తెర పడును)

## ద్వితీయ రంగము

[ఉద్యానవన విహారము]

చిత్ర : ఉషా ! వెనుకటివలె కాదే - నీలో రెండు గొంతుకలు వినఁబడుచున్నవే.

ఉష : ఏమి వడిదానవు ? రెండు గొంతుకలు కాదు; మూఁడును.

అని : (ప్రవేశించి) మూఁడును.

చిత్ర : మఱచితిని, దేవీ! నాగమణి యిప్పుడిటకు వత్తునన్నది. నేను నెమ్మదిగ నామె కెదురేగి యామెను రాకుండఁ జేసెదను. ఇప్పటికే కాలవిలంబనమైనది.

(నిష్క్రమించును)

ఉష : ఒక్కచో మొలచి కొమ్మలతో పెనవైచికొను నీ మారేడు; రావి యెంత సొగసైనవి.

అని : మన నేస్తమువలెనే! ఋతువు లాఋను మన శృంగార
వనమందుఁ బూలఁ దొడిగినవి.

ఉష : ప్రియా! ఇట్టిప్రేమ యేల కలుగవలెను?

అని : సూర్యుఁడేల ప్రకాశించవలె! పూవేల తావినిఁ జిమ్మ
వలె? నది యేల ప్రవహించవలె?

ఉష : నాథా! మిమ్మువిడచి నేనొక్క నిముస మోపగలనా?

అని : ఓపగలిగిన దెవ్వరు? ఓపగలిగినవారిని నీవాపగలవా!
నీ యెడద పంజరమున బంధించి...

ఉష : ప్రాణేశ్వరా!

అని : ప్రాణమా!

ఉష : అల్లదె తర్జనికి సూటిగఁ దమ్మిపూవు కడఁ దుమ్మెదను
పరికించితిరా?

అని : అచ్చెరువేల?

ఉష : రాజుదయించెను, తామర ముకుళించినది. పాపము!
తుమ్మెద బందీ...

అని : కాలగతి!

ఉష ! దేవా! సరస్సున నీ వెన్నెల కన్నుల విందు సుడీ!

అని : కలువకన్నెలు రాజునకుఁ గైవారములు సేయుచున్నవి.

ఉష : ఆహా! యీ మల్లియ, మాలతి, తావుల కొటారులు.

అని : మిటారీ! పిలుపుతెగిలిన సమీర కుమారుఁడు చేరల
దోచుకొనఁడా?

ఉష : అతఁడు దోచుకొనవచ్చును కాని యివి దాచుకొనవు.

అని : రాణీ!

ఉష : రాజా !

అని : అంతయు నొక ప్రణయ కావ్యము.

ఉష : నాయకులు తమరు.

అని : మఱి నాయిక తేలిపోయినది. జాబిల్లి వచ్చి వాని యీ లతానికుంజమును సంభావించెనా ?

(బాణాసురుఁడు హఠాత్తుగాఁ గత్తితోఁ బ్రవేశించును. నేత్రములు [illegible] నుండును. ఉష వెనుక ప్రక్కనే నిలబడును. అనిరుద్ధుఁడు నిశ్చలుఁడు.)

బాణ : నా యంతఃపుర ద్రోహమును సమకట్టిన యీ ఘాతుక డింభకుఁడెవ్వఁడు ?

అని : అనిరుద్ధ కుమారుఁ డుషామర్యాద సహింపఁడు.

బాణ : కృష్ణపౌత్రుఁడా? సంగడమునకున్న జార చోరత్వాది లక్షణము లెట్లు పోవును ? ఓహో ! డింభకాధమా ! ద్రోహీ! నిన్ని పిడికిట నలిపివైచెదను.

అని : అధిక ప్రసంగము హానికరము.

బాణ : ఏమిరా ! సిగ్గెనను లేదే ! ఏదిరా యీ చంద్రహాస మునకు బదులు ? [అని కత్తినెత్తును.]

ఉష : తండ్రీ ? తిలకము నిలుపవా ! [అని యేడ్చును.]

బాణ : కులపాతకురాలా! అసురజాతికి తలవంపు తెచ్చితివి. నీ పాట్లు నీవు చూచికొనినఁ జాలును.

అని : నిరాయుధుని చంద్రహాస ఘాతమునకు బలిపెట్టుట బాణాసురుని యుద్ధనీతి. పరాక్రమ ద్యోతకము. ఓహో ! బాణప్రభు పట్టి రణశూరుఁడు! ఎన్నాళ్ళకు కంటిని !

బాణ : నీ నీతికి నీతులఁగూడ నెన్నవలెనా ?
పొగరు తలకెక్కి మా యంతిపురినిఁజొచ్చి
దోసకారికి రణనీతి బాసలేల
దండి మగఁటిమి కలదే? నీ తాతకంటె
కాఁగలదు పెండ్లి - యిదిగో ఖడ్గమ్ము గొనుము
(అని వాలుఖడ్గ మందించును)

అని : మామా! పెండ్లి యీవలకే తైసట. పొగరు తలకెక్కి గాదే వచ్చితిని మామా! ముఖముఖన్నది యుద్ధమున్నది. మా వంగసమును స్పృశించుటకును నీ కధికారము గలదా? ముక్కోటిదేవతలను నొక్కమాటు సాక్షికిఁదెచ్చికొనుము. నా తండ్రి, మామ వజ్రనాభునిఁ జంపినాఁడు. ఈ వంశాచారము నాకును వచ్చునేమో యని సంశయించుచుంటిని. లేకున్న ...

బాణ : లేకున్న వెలగఁబెట్టుదువు. మాటలు కోటలు దాటుచున్నవే. నే నెవఁడనో తెలియునా డింభకాధమా!

అని : నీవెవ్వరైన నేమి! డింభకుఁడు డింభకుఁడందువేమి!
మత్తవారణప్రభుల కుంభస్థలమ్ము
నిట్టె భేదించు సింగంపుఁబిట్ట, యటులె
కొండలనుఁగూల్చు కులిశమ్ము కొలచుటగునె
యాకృతినిబట్టి శక్తి; సంహారవేళ!
నేను సిద్ధము [అని కత్తి నెత్తును]

ఉష : [ఏడ్చుచు] ప్రాణేశ్వరా! మీరు నా జనకులు. ఒకరు తనువు; ఒకరు ప్రాణము. నే నీ పోరాటమునుఁ జూడఁ జాలను. నాపై నాన.

అని : [కత్తిని దింపును]

ఉష : [కత్తిని లాగికొని] కృపాణమా! సంగ్రామ మూల కందమును బెల్లగించి వేయలేవా? [ఆత్మహత్యకై కత్తినెత్తును.]

చిత్ర : దేవీ! నీ వెట్టి హత్యకుఁబాల్పడుచుంటివో తెలియునా? [అని కత్తి లాగుకొనును] ప్రభూ! తమరు సర్వజ్ఞులు. తమరి కెదుఁగు లేదు కదా! పునరాలోచనమునకై యీ దాసురాలు మనవి చేసికొనుచున్నది.

బాణ : [అభిమంత్రించి] డింభకా! నీ ప్రాణము లెప్పటికిని నాచేతనే కలవు. నిన్ను నాగపాశమున బంధించుచున్నాను. విడిపించుటకు నీ తాత దిగిరావలెను. ఎవఁడురా అక్కడ? ఇతనిని కారాగారమునకు ... ...

(తెర పడును)

# చతుర్థాంకము

## ప్రథమ రంగము

[ నారదుడు, శంకరుడు—తెరనుండి ]

నార : శంభో ! తమ ఇది యేమి ?

శంక : ఎఱుఁగవా ? నారదా !

నార : ఏదీ, యెట్టెట్టా ?

శంక : బాణాసుర తపఃఫలితము.

నార : దేవా! తమ కైలాస మేమైనది? తమకు శోణనగర రక్షకత్వమా ? యుద్యోగము.

శంక : నారదా ! నా భక్తులకు నేను దాసుఁడను. వారి తపస్సునకు నేను వశుఁడనయ్యెదను.

నార : కాని–ఇట్టి వెంగేని కలవా? (అని ముక్కుపై వ్రేలు వేసికొనును.)

శంక : నారదా ! వాంఛితములు బహుముఖములు.

నార : ఇట్టివాఁడు రేపు వెన్నునితో మిమ్ము కయ్యమును గోరఁడను మాటేమి ?

శంక : నారదా! నగర రక్షణ విధియందు నేను ప్రవర్తిల్లక తప్పదు కదా !

నార : భక్తరక్షణ కళాసింధూ ! నమస్కారము. పోయి వచ్చెదను.

శంక : శివం భూయాత్.

[ తెర యెత్తుదురు : బాణుఁడు — రాణి ]

బాణ : అది యసంభవము.

రాణి : ప్రభూ ! కనికరింపరా ? గారాబుపట్టి కిఁక నీరము వదల వలసినదేనా ?

బాణ : ఇది యపూర్వమైన నేరమా ?

రాణి : ప్రభూ ! తాము సుంత యోజింపుఁడు. ఇం దేమంత నేర మున్నది ? స్త్రీపురుషుల కన్యోన్య ప్రేమ స్వభావము కదా. ఇంతకును తమకుఁ గల శత్రుపక్షమే ! యను సందేహమే కాని – లేకున్న తామును హర్షింపరా ?

బాణ : కృష్ణుఁడు నాకేనా శత్రువు ? అసురజాతి నంత మొందింప సమకట్టిన కిరాతుఁడు. అతని నామము వినుటకు నుచ్చరించుటకును మచ్చరించు నాకా నీమాటలు? ...

రాణి : స్వామీ ! ఈ రెండు జాతులకును వైర మంత మొందు మార్గము లేదా? ఏనాఁటికి నీ జాతుల ప్రజలు గుండెలపై చేతులవైచుకొని నిద్రించు రోజులు రావా? యుగములుగా నీ పోరాటము సాగవలసినదేనా ?

బాణ : విధి యనుల్లంఘనీయము.

రాణి : పౌరుషమున ప్రయత్నింపరాదా ? ఈ సంగ్రామ నాటకమున కుషాపరిణయమే భరతవాక్య మేల కాకూడదు !

బాణ : రాణీ! ఎందరెందరు మహోత్తమ వ్యక్తులు దానవ జాతి చరిత్రలో కృష్ణవంచకత్వమునకు బలిదానమైరి? ఆ స్మృతులీపట్టున చెరగలేదే ! ఆపాదమస్తకమును భగభగలాడు కృత్యములకు హేతువు; ఆ కిరాతుని

కరాసిఖండించి వత్సోదురక్తము జుర్రినిదే నాకు మన శ్శాంతి కలుగునా?

రాణి : స్వామీ! పగయనుసరి మనోధర్మము. పెంచిన పెరుగును; త్రుంచిన తునుగును. తమ రాచపోకడలకై ముద్దరాలిని ముద్దుకూతును బలిపెట్టుట న్యాయమా?

బాణ : (నవ్వి) పిచ్చిరాణీ! ఒకజాతి శ్రేయస్సుకంటె నొక జీవి శ్రేయస్సే యెంత గొప్ప? నాకు మాత్రము నిప్పు తోపలేదా? ఏమది? వారుగో నారదులు!

[ బాణుఁడు లేచి యాహ్వానించును. నారదుఁడాసీనుఁడు కాఁగా దంపతులును కూర్చుందురు. ]

బాణ : స్వామీ! సమయమునకే విచ్చేసితిరి. అనిరుద్ధుఁ డిచ్చట నంతఃపురద్రోహము చేసినాడు. ఫలితముగ నతఁడు బందీ. చూచితిరా కృష్ణసంప్రదాయము? శోణపురమునసే యిట్టివి పుట్టినన్న వారి దుండగము నకు మేరయే లేదు.

నారద : ఏమి యీ విడ్డూరము!

రాణి : స్వామీ! కేవల మాతనిపైననే నేరమును మోపుట నా కభిమతముకాదు. ఈశ్వర రక్షితమైన యీ నగర మున దానవ సాహాయ్యములేకయే యాతఁడెట్లు రాఁగలఁడు?

బాణ : ఏమీ?

రాణి : కనుప్పు చించుకొనిన కాళ్ళపైఁబడును. అనుకూల దాంపత్యము దోషాకరము కాదుకదా!

[ చిత్రరేఖ ప్రవేశించి ]

చిత్ర : ప్రభూ! కారాగారమున ననిరుద్ధుని వీక్షించుట కొక్క మాఱు పాకుమారి దేవరయనుజ్ఞ వేడుకొనుచున్నది.

బాణ : వినరాదు, వీలులేదు. కట్టడి చేయవలసినది.

(చిత్రరేఖ నిష్క్రమించును.)

రాణి : మునీంద్రా! ఆతని శత్రువని బంధించినను వారు దంపతులు కాకపోరు కదా! సంతసింపదగిన సమయమే! తొలిచూలే.

బాణ : హరహరా! (అని చెవులు మూసికొనును) అసుర జాతి కాగర్భశత్రుని నల్లుఁడని పిలుచుటకన్న నాత్మహత్య కలదా?

నార : నిజమే.

రాణి : జరిగిన దానినిఁ బట్టి, పిలువకయున్నను కాకపోవునది కలదా?

నార : వాస్తవమే.

బాణ : ఈ పరాభవము నేను సహింపఁగలనా?

నార : యథార్థమే.

రాణి : ఏమి మునీంద్రా! తేల్చరేమి?

నార : అదియే యాలోచించుచుంటిని.

రాణి : నేను దాంపత్యమును చీలతీయవల దందును.

నార : అదియును బాగుగనే యున్నది.

బాణ : కృష్ణుఁడు బాణప్రభు నింతకంటెఁ జేయగలిగినది లేదు.

నార : అవును. ఇంతకంటె చేయగలిగినదిలేదు. (ఆలోచించి) ఏమో ! అనిరుద్ధుని బంధించితిరికదా !

బాణ : ఏమీ ! ఈశ్వర రక్షితుని నన్ను తేరిచూడగలరా ! (ఆలోచించి) జగత్ప్రళయ సూచనలు కన్పించుచున్నవి. తమయూహ వాస్తవమే కావచ్చును. (ప్రక్కకుచూచి) సమస్త సైన్యములను కట్టాయితము చేయుఁడని మంత్రి కుంభాండుని కుత్తరువు.

నార : అయినను ముక్కంటిని గెలిచిన పిదప కదా! కృష్ణునికి నీతో యుద్ధము.

(తెర పడును)

## ద్వితీయ రంగము

[ తెర నెత్తునప్పటికి కృష్ణుఁడు. తరువాత నారద ప్రవేశము. ]

కృష్ణు : దేవమునీ ! నా గేహము పావనమైనది. ఇదే యాస్తరణము. విశేషమేమి మునీంద్రా !

నార : ఏమున్నది! మొన్న దేవలోకమునకుఁ బోయితిని.

కృష్ణు : దేవరాజు కుశలమా ?

నార : ఏమి కుశలము! ఈశ్వరుని నగరపాలకునిగాఁ జేసికొనిన బాణాసురుఁడు ప్రళయాదిత్యుఁడైనాఁడు. ఆతనికియుద్ధభేరియు విజయభేరియు నొక్కటే. నీ యన్న దేవేంద్రుఁడు 'దాసోహ' మ్మనినాడు. రంభ, తిలోత్తమ,

ఘృతాచి, మేనక, వారి పాట్లు నగచాట్లు వారికే యెఱుక. అంతయు బీభత్సమైనది. దివస్పతి జాతక మొదుదుదుకులతోఁ గూడినది.

కృష్ణ : అది యీశ్వర వర ప్రభావము.

నారద : ఆతఁడు బ్ఱులింగఁడు. రాజనీతి యనిన నీదే కదా! అబ్బా! ఇట్టివెన్ని సవరించుకొని వచ్చితివి?

కృష్ణ : దేవేంద్రుఁ డేమైన చెప్పెనా?

నారద : ఏమని వాకొనఁగలఁడు? నీవు చూచుచునేయుంటివి కదా! యనిమాత్ర మనెను.

కృష్ణ : నీవుండియు నాతని వారింప లేదా?

నారద : నేను దేవమునినికదా! నేను వారించిన నామాట శిరసావహించునా?

కృష్ణ : బాణుఁడంత గండరగండఁ డయ్యెనా?

నారద : దేవేంద్రునకే దిక్కులేనప్పుడు మిగిలినవారిని తడవ నేల? ఈశ్వరుఁడు మనకు ప్రభుకదా, యీ వసుంధర నలచేత పిండలేమా! యన్నంత 'ధీమా' యాతనికి కలదు. నీవును నాతనిదృష్టిలో నానినవాఁడవుకాదు.

కృష్ణ : ఏమి నారదా?

నారద : తెలియును, నీ పరాక్రమము నాకు తెలియును. కాని యాతనికి తెలియుట కవకాశ మెక్కడిది?

కృష్ణ : అవకాశమే కలుగకపోవునా?

నారద : ఏమో! ఎప్పటిమాట! ఈ నాటి దేవేంద్రుని గతి చూడుము.

స్వర్గసీమను గల సర్వ సౌఖ్యములను
బాణ విభు ప్రోలఁ దా సమర్పణము సేసి
ఏ కతమ్మున కంటికి నెట్టిజేర
కలుగునో యని చేతులు కట్టి నిలుచు.

కృష్ణు : నారదా! ఇది బాణాసురునికి నిజముగా క్షేమమేనా?

ధర్మము త్యజించి యతఁడు సుధర్మగెల్చి
యాక్రమించిన జీర్ణించు నయ్య తుదకు?
గోదుమని యేన్చు ముప్పదిమూఁడుకోట్ల
సురల యుసు రది చిచ్చుల కురియుగాని.

నార : ఏమో! ఆతని పరాక్రమముఁ జూచిన నేమని చెప్పుటకును వీలులేకున్నది. ఆతనిపై దండెత్తుటకు తొలుత ముక్కంటితో పోరాడవలయును కదా! కాని యిది యొక పెద్ద సమస్య.

కృ : నారదా! దీనిని కాలమే పరిష్కారము చేయును. ఉన్నది యుండగా ననిరుద్ధ కుమారుఁ డగుపడుటలేదు. నాల్గు నెలలైనది.

నా : ఎట్లెట్లూ!

కృ : ఒకనాఁడు తెల్లవారునప్పటికి రాత్రి సుఖశయ్యను నిద్రించిన యనిరుద్ధుఁడు మాయమయ్యెను. ఇంచుకయును జాడ తెలియలేదు.

నా : బాణనందన వలచి చెలి చిత్రరేఖచే తెప్పించుకొన్నది.

కృ : ఓహో! రాక్షసులతో పొత్తా!

నా : తమరు ప్రపితామహు లగుదురుకూడ.

కృ : అపహరించవలసిన యవసరమేమి ?

నా : మఱి బాణుఁ డంగీకరించునా ?

కృ : అయిన నిది రహస్య వ్యాపారము. బయల్పడకుండునా?

నా : బయల్పడినది.

కృ : ఫలితము ?

నా : అనిరుద్ధుఁడు బందీ.

కృ : హా! అనిరుద్ధ కుమారా ! (అని నిట్టూర్చి) నారదా ! ఇదియేమి ధర్మము? వలచినది రాక్షసులు. అపహరించినది వారు. బంధించినదియు వారే !

నా : ఆతని ననవలసిన యవసరమేమున్నది? ధర్మ సంస్థాపకుల యుపేక్ష యెంత లోకోపద్రవకరము !

కృ : ఆహా! నేటి కాతని దుర్నయము పరిపక్వమయినది.

నా : అయిన దనుకొనుటకును వీలులేదు. ముక్కంటి యాతని బంటు.

కృ : ఆతఁడు మాత్ర మధర్మముగా పోరాడునా ?

నా : ప్రస్తావనలో నామాటయు వచ్చినది ! భక్తరక్షణ మనగా బాణరక్షణమే నా కవశ్యవిధి యనెను.

కృష్ణ :

ఫాలనేత్రుఁడైన బ్రహ్మదేవుఁడైన
ఇరువురైన వచ్చి యేమి కలదు ?
ధర్మమున్న చోట తప్పదు విజయంబు
తప్పదింక దూరము తాపసేంద్ర.

నా : శివకేశవ సంఘర్షణము లోకోపద్రవకరము. కాని యే విధముగఁ జూచిన నిది తప్పునట్లు లేదు.

కృ : రాక్షసుల నుపేక్షించుట పామునకుఁ బాలు వోసిన ట్లయినది.

నా : సందేహమా ?

కృ : దేవలోకము నాక్రమించిన నూరకొంటిని. నా మంచి తనమును వారర్థము చేసికొనిరా ?

నా : శివకవచ ధారి కిది మంచితన మగునా ? అసమర్థతయే యనిపించును.

కృ : సద్యఃఫలితమునే యనుభవించును.

నా : కృష్ణా ! ఇట్టి యెద్దడులలో నీ నిర్ణయమే లోకమునకుఁ బ్రసాదము. ఇట్టివెన్నియైనవి ! ధర్మ చక్రమున కధి కారివి నీవే కదా !

కృ : మహా ప్రళయము రానున్నది. ఎవరురా యక్కడ ? శోణపుర ముఖమున రణభేరి మ్రోగింపుమని దండ నాథుని కాజ్ఞ.

నా : ఆహా ! ఏమి కానున్నదో కదా !

(తెర పడును)

# పంచమాంకము

## ప్రథమ రంగము

[ విషాదములో ఉష ]

చిత్ర : దేవీ ! ఊరడిల్లుము

ఉష : పూవు తెమ్మన్న కశని ఘాత మేల!

చిత్ర : నాగమణి యెప్పుడు చూచినదో, వెంటనే సర్వమును ప్రభువులకుఁ జెప్పివైచినది. ఆ దినమున నొక్కింత ముందుగా నే నెదురేగవలసినది.

ఉష : జరుగవలసిన దిటులుండగా నీ వెట్లెదురేగెదవు?

చిత్ర : రాణిగారు ప్రభువుల కెంతయో చెప్పి చూచిరి.

ఉష : తల్లిప్రాణము కదా !

చిత్ర : నీ శరీరస్థితి దుఃఖమును సైచునా?

ఉష : ఇఁక మిగిలినదే దుఃఖము కదా! ఈ జీవితాకాశము నకుఁ బూర్ణిమ గడచిపోయినది.

చిత్ర : అమావాస్య మాత్రము పీటల నంటిపెట్టుకొనునా?

ఉష : వలదనిన, నాజ్ఞగా—కృపాణమును దించిన నార్యపుత్రుని దృశ్య మనుక్షణము కన్నులకుఁ గట్టి హృదయమును కలఁచుచున్నది. ఆ రణధీరునకు ప్రణయధీరునకు నావలననే కదా ఘోర కారాగారవాసము! పాపము! ఆర్యపుత్రుని మాత యెంతగా నడలుచున్నదో! అతని యంతఃపుర మెంత చెన్నుఁ దరిగినదో! నా యుసురున

కెంతమంది బాధితులో! ఈ స్వార్థైక జీవి ప్రవర్తన
మెంత లోక కంటకము! అమృతములో చేదుబొట్టు
రాలినది – ఫలిత మవశ్య మనుభూతముకదా!

చిత్ర : దేవీ! ఆ జగన్మాతయే మనల రక్షింపగలదు.

ఉష : రేఖా! ఇంకను నీ కాశ కలదు. ఆశ యెంత బలీయము!
ఆ యంకురమే లేనిచో విషాద జీవు లా క్షణముననే
యంతరింపవలసిన దేకదా!

చిత్ర : ఒరిపిడివలననే కదా–రత్నమునకు శోభ! ఈ జీవిత
నికషమున నెట్టిమహత్తరతత్త్వము ద్యోతకమగునో!
ఒకప్పుడు సిలుగులు వెలుఁగుకారణ మగును కదా!
ఇది యొక పరీక్షగా నేల భావింపరాదు?

ఉష : ఈ దినమున నార్యపుత్రుని స్థితి తెలిసికొంటివా?

చిత్ర : ఇప్పుడే యరిగి క్షణములో తెలిసికొని వచ్చెదను.
(నిష్క్రమించును)

ఉష : భవానీ! సర్వమంగళా! నా పసుపుకుంకుమల
నిలుపవా? దేవీ! నీవేకదా–నాకీవరుని సంధానించినది!
లేనిచో నిట్టి రూపవంతుని,సర్వలక్షణలక్షితుని,యంతః
పుర కాంతను, నే నెట్లెఱుఁగగలను? స్వప్నమున నిట్టి
యనుగ్రహముఁజూపి, లభ్యమగుటలో సాయపడి, నేను
నే డీరితి హింసింపఁబడ తూష్ణీంభావము వహించుట
న్యాయమా? నాడు రుక్మిణీదేవికి సాయపడలేదా?
ఆది దంపతులు మీరుకాక నా కెవరు దిక్కు– శాంకరీ?
(అని మోకరిల్లును. కన్నులు తెఱచి) దేవీ!
[చిత్ర ప్రవేశించును]

చిత్ర : దేవీ !

ఉష : (వికాసముతో) విశేషము లేవియు లేవుకద ?

చిత్ర : నీ ప్రాణము క్షేమమే ! నిముసములో నీలో నంత తేజోవికాసమేమి ?

ఉష : ప్రాణసఖి ! భవానీదేవి నా రీతిలో ననన్యభక్తితో నారాధించితిని. ఆ సమాధిలో కన్నులు మూసికొనియే యున్నవి. ఒక్క వెలుఁగై, దివ్యస్వరూపమై, యమృత హస్తముతో నాశీర్వదించినది. ఏమియో పలికినది కూడ. "నీ వల్లభుఁడు ప్రమాదకృతమున సంభవించిన శాపకారణమున నాగపాశబద్ధుఁడు. నీకు శుభము కలుఁగును" అని మాత్రము విన్పించెను. ఇప్పుడును వినబడుచునే యున్నది. శాంభవి కృపావృష్టి కురిసినది.

చిత్ర : దేవీ- నే నిప్పు డొక్కమాట వింటిని. కృష్ణుఁడు స్కంధావారముతో మననగరమును ముట్టడించెనట.

ఉష : ఏమి విపత్తులు రానున్నవో ! జనకు లార్యపుత్రుని విడిచిపుచ్చి యుద్ధము చాలింపరు కదా !

చిత్ర : ఏమి కానున్నదో కదా !

ఉష : ధర్మము సమరము వలననే నిర్ణయింపఁబడునా ? మన స్తత్త్వముల మార్పుటకు యుద్ధము సాధనమా ? ఉషాసుందరి కారణముగా నిఱుపక్షములను రక్త స్రవంతులు పొంగి పొరల వలసినదేనా ? అమాయిక స్త్రీలు పతిసుతాదుల మాకై బలి పెట్టవలసినదేనా ? హింసాస్వరూపిణి యుద్ధమారి వేయినాల్కలు చాచి

వికృతాట్టహాసము చేయుచున్నదే! భవానీ! నీవు సంకల్ప మాత్రముననే యిట్టివి సమయఁజేయగలవు. కరుణాపాంగ వృష్టి గురియింపవా?

(తెర పడును)

## ద్వితీయ రంగము

[ తెర యెత్తగా : బాణుఁడు — కుంభాండుఁడు ]

కుంభాండుఁడు : ప్రభూ! నేల యీనినది. చటులభేరీబాంకారములతోఁ బండ్రెండక్షౌహిణుల సైన్యము వారణ వాజి స్యందన సందోహము బిలబిల వచ్చిపడినది. గోపుర ప్రాకారములఁ గూల్చినది. కవాటముల విరచినది. పరిఖలఁ బూడ్చినది. యంత్రంబులఁ జునిమినది.

బాణ : మంత్రీ! అంతటితో నాగుము. మన రక్షక సైన్యమేమైనది?

కుం : ఎదిరించినది. పోరాడినది. శరశరాసన శక్తిప్రాస తోమర గదాకుంత ముసల ముద్గర భిండిపాల కరవాల పట్టిస శూల క్షురికా పరశు పరిఘాది నిశితాయుధ వ్రాతముతో నుభయ కక్షలును తలపడినవి. కాని కృష్ణసైన్యము పట్టపగ్గములు లేక——

బాణ : ఆగుమాగుము కుంభాండా! చిరంజీవి బలుఁడేచ్చట?

కుం : ప్రభూ: సాంబునితో తలపడి ఘోరయుద్ధముఁ జేసెను. కాని పలాయితుఁడు. సాంబుఁడు విజృంభించి——

బాణ : తరువాత?

కుం : కూపకర్ణుఁడు కామపాలునితోఁ దలపడెను. నెత్తురు టేఱులఁ బాఱించెను. సైన్యములఁ జీకాకు పరచెను. ప్రళయ ఝంఝామారుతముల వీయించెను. కాని—

బాణ : పలాయితుఁడు — తదుపరి ?

కుం : ప్రద్యుమ్నునితో కుమారస్వామి యెప్పుడు నెవరు వినని కనని ఘోరరణము సలిపెను. కాని కొసకు—

బాణ : ఇఁకఁ జాలును. అందఱును పలాయితులే. కృష్ణునకు నాటగా నున్నది. బాణుఁడు లేని యుద్ధము యుద్ధమే కాదు.

కుం : స్వామీ ! ఇప్పటికైనను సంధింపరా ?

బాణ : సంధి — ఆ గర్భ శత్రునితో సంధి! సంధింపకేమి! నారి సంధింతును. ఇక నీవు పోయి చెదరిన సైన్యములఁ బురికొల్పుము. పొమ్ము.

(కుంభాండుఁడు నిష్క్రమించును.)

బాణ : నారదుఁడు యుద్ధమునకు హరునే నియోగింపుమనెను. అదియు నొక యూహగనే యున్నది. ఉగ్రా ; రుద్రా ! కంఠేకాలా ! మృత్యుంజయా ! హా ! శంకరా ! ఆర్తత్రాణపరాయణా !

[శంకరుఁడు ప్రవేశించును]

బాణ : స్వామీ ! ఇది యేమి న్యాయము ! తమరిది యుపేక్ష వహింపవలసిన సమయమా ?

శంకర ; నీ కేమి కావలెను ?

బాణ : సర్వమును కావలెను. కృష్ణ హంతకుఁడు మా దానవ జాతిని సర్వమును నిర్మూలింపఁ దలచినాఁడు. మీరే నాకు దిక్కు.

శంక: బాణా! పరస్పరము ప్రేమించుకొనిరి కదా! ఫలిత మును గలుగనై యున్నది కదా! అనిరుద్ధుని బంధించు టేల? కోరి కోరి కృష్ణునితో యుద్ధమేల తెచ్చు కొంటివి?

బాణ : ఈ మాటలాడునది శంకరులేనా? స్వామికే యిట్టి యనుగ్రహముకలిగిన బాణుఁడింక బ్రతుకనక్కఱలేదు. స్వామీ! జరిగినదానికి విచారించి ప్రయోజనము లేదని నాకుఁ దెలియదా? వారు భార్యాభర్తలైరని నాకుఁ దెలియదా?

శంక : మఱి సర్వమును దెలియునుకదా?

బాణ : తెలియును. కాని యీతఁ డనిరుద్ధుఁడు. అంతఃపుర ద్రోహముఁ జేసినాఁడు. ఇది నావంటివానికి తీరని పరాభవము. నా జాతి కవమానము.

శంక : నీ గారాబుపట్టి కపకృతి యొనరింతువా?

బాణ : నాజాతి గౌరవము పుత్రికా వాత్సల్యముకన్న మిన్న

శంక : బాణా! కృష్ణునితోఁ బోరాటము సామాన్యము కాదు. అతఁడు నా యంతవాఁడు. అనిరుద్ధుఁ డపహరింపఁ బడిన కారణమున ధర్మ మాతనియందే యున్నది. జయము ధర్మాశ్రితము కదా!

బాణ : కృష్ణునియందు తమకుఁగల యభిమానము నాకు నేటికి వెల్లడియైనది. నేను మిమ్ముల నారాధించినది కేవలము విష్ణునితో పోరికే. ఆ ప్రయోజన మాసన్న మైనప్పుడు తమరాతనితో నేకీభవించి నన్ను వంచింతురా ప్రభూ! ఈ దీనుని యం దనుగ్రహ మిట్టిదా?

శంక : అదికాదు బాణా!

బాణ : కాకేమి? తరతరములుగా నీ దానవజాతిని సంహరించు కృష్ణుని దుండగములను సహించుచు మిమ్మేమన వలెను? నమ్మించి మోసగింతురా ప్రభూ! తమకుఁ గృష్ణుఁడన్న మిక్కిలి యభిమానము. లేకున్న తమ సైగకంటిమంట కాతఁ డెట్లు త్రివచ్చునో-యట్లే-భస్మీకృతుఁడు కాఁడా? నేనే రణరంగమునకుఁ బోయెదను. కృష్ణ హంతకునిఁ జూర్ణముచేసికాని తిరిగిరాను. కాని శంభూ! మీయీ పరరక్షణత్వ మేమైనది, వర మేమైనది? జగత్తున కీ విషయము తెలిసిన చాలును!

శంక : నావరము జగత్ప్రళయమైనను జరిగితీరవలసినదే.

బాణ : అయిన నగరరక్షకా! బాణప్రభువు నిన్ను యుద్ధమునకు నియమించుచున్నారు.

శంక : అవశ్యము శిరసావహింతును.

(తెర పడును)

## తృతీయ రంగము

[ యుద్ధరంగమున : కృష్ణుఁడు, శంకరుఁడు, బాణుఁడు - ప్రవేశింతురు ]

కృ : శంభూ ! నమస్కారము.

శంక : చిరంజీవ.

కృ : శోణేశ్వరా! వెన్నుచ్చి పఱచిన నీ బలమును దిలకించితివి కదా ! ఇప్పటికైనను సంధింపరాదా ?

బాణ : కృష్ణా ! అపరాధిని శిక్షింపక వదలుట రాచపాడి కాదు. ఈ బాణాసురునికి గడియకొక నిర్ణయము లేదు. ఆరంభించినది కొనసాగవలసినదే.

కృ : బాణా ! ఎవ్వరికైన నంతియే. కాని దానిలోని యౌచిత్యమును గమనించునది. మదీయ భక్తుఁడగు ప్రహ్లాదుని వంశాలంకారమవు. నాచే నీపై కత్తికట్టింపకుము.

బాణ : ఏమి యీ కనికరము! కృష్ణా! తండ్రిని జంపుటకుఁ గొడుకును లోఁగదీసికొంటివి. ఎంతటి లౌక్యుఁడవు ! నీవు దైత్యులకుఁ జేసిన యొగ్గులు జగత్తునకుఁ దెలియును. నే నేకరువుపెట్టుట నా ప్రతిష్ఠకే భంగకరము.

కృ : బాణా! నీవు దురభిప్రాయపడుచుంటివి; నేననవసరముగ నే దానవుని సంహారింపలేదు. అతని ప్రవర్తనము లోకోపద్రవకరమగుట వలననే ప్రభుత్వము లోకకంటకమై, ప్రజలే తిరుగబడి నన్ను కారణభూతునిగా నొనర్చుకొనిరి. నాకు సర్వప్రాణులు నొక్కరూప,

నేనే యాతఁడై యున్న మహాదేవుని భక్తుఁడవు-నీవు నాకుఁ గూర్చువాఁడవు కాదా? నీవు స్వర్గమును గబళించితివి. ఏమో! మఱల నీవే యిత్తువులే-యని, నేను తటస్థముగనుంటిని. అనిరుద్ధు నేల బంధించితివోయీ! పాపము! ఆతని రాణివాసము కార్చు కన్నీటికైనను నీకు కనికరములేదా ? నీ యనుంగుబిడ్డ యుష యెంత దురపిల్లుచున్నదో! వియ్యమును, గయ్యమునకు దింపితివేమి ? ప్రేమైక జీవుల హృదయమందలి రసార్ద్రితనైనను గుర్తింపవుకదా !

బాణ : నీ చర్యలే నీ మనుమనికి నాదర్శమైనపుడు, నీ చెప్పు ధర్మములలో వింతలేదు. రాక్షసులే యాతని దెచ్చినను, నీ వివాహము నా కిష్ట మగునను నాశయే కోశమున నుండబోదు కదా! నాసంకల్పమునకు విరుద్ధమగు నాతని సాహసము నాకు సైపఁదగినదా! నన్నుఁ జూచి యాపె ననిరుద్ధుఁ డేల తిరస్కరింపరాదు ఉషాబాల ముగ్ధ; ! తానో నీవు వచించినట్లు-వివాహితుఁడు, ప్రాజ్ఞుఁడు ...

కృ : బాణా! నీ యనుఁగుబిడ్డయు నప్రాజ్ఞురాలు కాదు. కోరి వరించిన నెలఁతె నంగీకరించుటయందు దోస మిసుమంతయును లేదు సన్నుబట్టి యనిరుద్ధుఁడు విరోధియే యైనను, నల్లునిబంధించునంతటి ఘోరకృత్య మొనర్తువని యాతఁ డెఱుఁగక పోవచ్చును. కాని, కాదన్నను బంధుగులము; కయ్యమేల నోయీ !

బాణ : జిత్తులమారీ ! బులిపింపు మాటలచే నన్ను మోస
గింతువా ! శోణనగరమున శోణితవాహినుల ప్రవ
హింపఁజేసి, నేడు ముక్కంటితోఁ బోరాడలేక తప్పిం
చుకొనఁ జూచు నీచాకచక్యము నే నెఱుంగనిదికాదు.
కృష్ణా ! నీవు దైత్యుల కొనర్చిన యపకృతికి శిక్షాఫలి
తము నేఁడే పొందఁగలవు. ప్రభూ ! సైరింతురేల !
విష్ణుమాయ సర్వజ్ఞుని సైతమాచ్ఛాదించునా !

కృ : బాణా! చవిటివానిముందు శంఖమూదితిని. మహాదేవా!
తమరు నాతో సమర మొనరింతురా ?

శంక : కృష్ణా! నేను నగరరక్షకుఁడనుకదా! నీవే నగరముపై
దండెత్తివచ్చితివి కదా !

కృ : ఇది తమకు ధర్మముగనే తోఁచెనా !

శంక : కృష్ణా! బాణప్రభువు నియంత. నియంతలకు సూచిం
తుము కాని శాసింతుమా !

కృ : ఈ నియంత యధికారము వెగటై-ప్రజలీ బాధ నుండి
విముక్తులను జేయవలసినదిగా ఘోషించుచున్నారు.
నేను నాయకత్వము వహింపక తీరినది కాదు. నా
మనుమని బంధించి, బాణుఁడు తనఁ గట్టఁ ద్రాళ్ళ
దానే తెచ్చుకొనినాఁడు.

శంక : కృష్ణా ! నా సమక్షమున బాణుని నిందించుటయు
నాకు సైపఁదగినదికాదు. నీకు చేతనైన రణము
సల్పుము.

బాణ : మహాదేవా ! నీ పల్కులకుఁ బంచ భూతములును
మెచ్చినవి.

కృ : గరళకంఠా ! నే నింత తడవు ప్రసంగించుట యవసరము నియే కాని, నీకు వెఱచికాదు. బాణునకు జడిసి కాదు.

బాణుని బంటుతోడ సిగపట్టులు పట్టెను కృష్ణుఁడన్న, నీ న్యూనతకేను కొంకెదను మానము—నీకయి జంకువాఁడనే! దానవ పక్షపాతివి—యథార్థమెఱింగిన నీవుకూడ, నీ పూనిక మెట్టిపాటిది! ప్రభుండెబాణుఁడు, శాసకుండహో!

బాణ : ఆ! ఏమిరా! నీ వాకూచ్ఛరత్వము? త త్త్వమెఱుంగక భక్తసులభుని, భక్తరక్షకుని, బంటనియెదవేమి! ఆతఁడే నాకు వల్లభుఁడో, నేనే స్వామికి శాస్తనో—మా యుభయులకే తెలియఁదగిన; సంబంధించినవిషయము. మహా దేవుని దూషింతువా ? శివ శివా !

శివుని పేరెత్తి యెవఁడు దూషించువాఁడొ
వాని శిరమది వేయిగాఁ బగులవలదె
శంకరునిఁబోలు దైవమ్ము జగతి కలఁడె
కరుణ వారాశి యెవరు ముక్కంటి సాటి !

శంక : బాణా! నీకేటికీ తొందర! అతఁడు మాత్ర మేమనెను!

బాణ : బంటనుట చాలదా !

శంక : అందు దూషణ మేమున్నది !

బాణ : అధిక్షేపము, దూషణమునకు ప్రాతిపదికము. విప్పి చెప్పిన నభేదము.

శం : నియమితుఁడనని నేనే చెప్పుకొనినప్పు డాతఁడు బంట నుట వలన వచ్చిన నష్టమేమి ? అదియు నొక యలంకారమే యగును గదా !

బాణ : బంటు, బంటని-తేప తేపకు నెత్తిపొడుచుటవలన, ననగా ననగా, నెప్పటికేని, మీకును నాకునుఁ బొర పొచ్చెము గల్గునను దూరదృష్టితో, నీ జిత్తులమారి భేదోపాయమును బన్నుచున్నాఁడు. స్వామీ ! నిజముగాఁ దమరు నాకు సేవకులా! అవాచ్యము, అవాచ్యము. వరప్రదానము కృష్ణ నిగ్రహమునకే యయినప్పుడు, తా మాతనితోఁ బోర సందేహించు చున్నప్పుడు నాకు తమవలనఁ గలుగఁబోవు వ్యావహారిక ప్రయోజనము నపేక్షించి మిమ్ము నియమించితిని కాని, యఖిల జీవులకును శాస్తలగు మిమ్ము నేను శాసింపఁ గలనా !

శంక : బాణా! ఈతఁడు సర్వజ్ఞుఁడు. కృష్ణ పరిహాసము, నా బాణ సహోద్యమమును మఱల్పఁజాలదు.

బాణ : ప్రభూ ! ధన్యుఁడను !

శంక : గోపాలా! ఏదీ, నీ యస్త్రము!

(కృష్ణుఁడు-శంకరుఁడు ప్రక్క తెరలోనికిఁ బోవుదురు)

బాణ : అహో! ఏమి యీ యుద్ధము! శస్త్రాస్త్రములు పుంఖానుపుంఖములు: ఉభయుల శరీరములును మోదుగపూవులైనవి. నాకై స్వామి యెట్టి త్యాగముఁ జేయుచున్నాఁడు! జయము మహాదేవా! – సెబాసు! కృష్ణుఁడు మూర్ఛిల్లినాఁడు. జై బాణాసురా! ఓహో! ఇదియేమి! వెంటనే లేచెనా! – స్వప్నము కాదుకదా ! ఏమిజరిగినది ! స్వామీ ! స్వామీ! శంకరా ! (అని తెర ప్రక్కకు పఱుగెత్తును.)

# తృతీయ రంగము

[స్వామీ! స్వామీ! స్వామీ! అని బాణాసురుఁడు శంకరుఁడున్న తెరప్రక్కకుఁ జేరును-కృష్ణుఁడు వేఱొకప్రక్క తెరలో నుండును]

ఎంతటి ఘోరకృత్యమాచరించితిని! ఇఁక యేటి శంకరుఁడు! పెనుమూర్ఛను మునిగియున్నాఁడు. ఓహో! భక్తునికై తనువు నర్పించిన యీ మహాదేవుఁడే దేవుఁడు కాని దైవతమని వేఱుకలదే! హా శంకరా! బాణుఁడెంత స్వార్థపరుఁడు! తానేల యుద్ధమునకుఁ దలపడలేదు! – స్వామీ! స్వామీ! స్వామీ! సిగపూవు జాబిల్లి, కందిపోయెనే! గంగాభవాని బొళుకు బొళుకుమని ఘోషించుచున్నదే! మహాదేవా! నిన్ను వాడినారాచముల నా కృష్ణహతకుఁడు నొప్పించెనా! అహో! అమ్మవారెంత యార్తినిఁ గుందుచున్నది! మిమ్ము యుద్ధమునకుఁ బురికొల్పి యింతకుఁ దెచ్చిన బాణాసురుఁ డుండిన నేమి! మండిన నేమి!

(కృష్ణుఁడున్న తెరప్రక్క కేగి)

ఓరీ! కృష్ణా! కాచుకొమ్మురా! పాపీ! ఎన్నాళ్ళకు నాకు చేతులనిండ పని కలిగించితివి! ఈ ప్రచండ బాణఘాతము నను జవిచూడఁగలవు. ఇన్నాళ్ళకు నీకుఁ దగిన శాస్తి జరుగునుకదరా-ద్రోహీ! నీ మనుమనికై, మహాదేవుని హింసించితివా! నేనే మహాశివభక్తుఁడనైన, నమ్మవారికే నాపై ననుగ్రహముగలిగిన, నిదే పాశుపతాస్త్రము...

[కృష్ణుఁడు పడుట గమనించి]

పిట్ట కూలినది కదా!

[ శివుఁడున్న తెరదగ్గఱకు తిరిగివచ్చి ]

స్వామీ ! నా బాహువులతో వీవనలు పట్టుదునో ! పాదముల నొత్తుదునో ! తామిఁక బాణునికై యుద్ధమొనర్ప నక్కఱలేదు.

[కృష్ణుఁడు వికటాట్టహాసముచేసి ప్రక్కతెరనుండి రంగస్థలమునకు వచ్చి)

కృ : మూర్ఛ తేరితిని బాణా ! ఇఁక కాచుకొమ్ము. (అని చక్రము పట్టును)

బా : ఓహో ! విష్ణుచక్రమా ! భయములేదు.

[శంకరుఁడు మూర్ఛతేరి ప్రక్కతెరనుండి ప్రవేశించి]

శం : ఏమిజరిగినది! ఇంతత్వరలో నాతనితోఁ జక్రముపట్టించు నంతటి యుద్ధ మొనర్చితివా! చక్రమునే, ప్రయోగించెనా ! అయ్యో ! భక్తున కెంత ప్రమాదము ! బాణాసురా! నా వెనుకకు రమ్ము. దాని నాపుటకు బ్రహ్మకును నాకును దక్క నేరికిని సాధ్యముకాదు. రమ్ము బాణాసురా ! రమ్ము-భక్తాగ్రణీ! రమ్ము! నన్ను గెల్చినఁగదా, నిన్ను గెల్చుట !

[అని బాణుని వెనుకకులాగును. బాణుఁడు రాఁడు]

బాణ : బాణప్రభువు యుద్ధమునకు మిమ్ము నియోగించెను. తమరి యుద్ధమయిపోయినది. స్వయముగా యుద్ధమునకు దిగిన బాణప్రభు వసువులకై యొరుల మాటున డాగువాఁడుకాఁడు. ఇతడు శివశక్తి ప్రపూర్ణుఁడు. ఈతనిని చక్రమేమి చేయగలదు! ఈతఁడేమిచేయునో స్వామి చిత్తగించెదరుగాక! నాకై స్వామిని హింసింపఁ

జాలను. తమ వరము పూర్తియైనది. దానవజాతి భావిని బాణుఁడే నిర్ణయించుకొనవలెను.

శంక : ఇదియేమి బాణా! నీకు మొఱకుతనము హెచ్చె. కలుఁగఁబోవు ప్రమాదమును గుర్తింపవు.

[ తెరవంక చూచి ]

అహో ! కేతనము పడినదా! బాణా ! నీవు నా మాటునకు రాకున్న నేనే నీ ముందునకు వచ్చి యడ్డు పడెదను. నగరమును రక్షించి తీరెదను. చక్రము నన్ను దాటికాని నిన్ను సమీపించుటకు వీలులేదు. ఈశరీరము నాభక్తునిది. శంకరుఁడు భక్తవశంకరుఁడు.

కృష్ణా! ఎంతపని చేసితివి! చక్రమును నాపైననే ప్రయోగింపకపోతివా! నాతో యుద్ధము ముగియనిదే యిట్లేల యొనర్చితివి? ప్రళయఝంఝామారుతములు వీచుగాక! కుంభిని కంపించుగాక ! సప్తపాథోధులు ఘూర్ణిల్లుగాక ! ఈ చక్రము బాణుని సమీపింపక పూర్వమే, త్రిశూలమా! నీవు చక్రముపైకి పొమ్ము. ఇంతవఱ కెన్నడును చక్రముపై నిన్ను ప్రయోగించినది లేదు. ఇది పరీక్షా సమయము. శివకేశవుల శక్తి నిర్ణయము కావలెను. చతుర్దశ భువనములు చూర్ణములగుఁ గాక ! తేలవలసినది తేలవలసినదే. పొమ్ము త్రిశూలమా! పొమ్ము.

[నారదుఁడు ప్రవేశించును]

నా : కృష్ణా! చక్ర ముపసంహరింపుము.

కృ : వీలులేదు.

నా : మహాదేవా !

శంక : జరుగనున్నది జరుగవలసినదే—

నా : అధికార పురుషులకే యిట్టి సంఘర్షణము కలిగిన లోకము లాగునా ! చతుర్దశభువనములును స్వరూపము లేకుండఁ బోవుచున్నవి. హా ! విధీ ! త్రిమూర్తులలో నొకఁడవు. నీవుఁదక్క నీ ప్రళయముఁ దప్పింప గలవా రెవ్వరు? లోకరక్షణ మొనర్పఁగల సమర్థు లెవ్వరు? తండ్రీ ! తమ్ముగద్దె దిగిరావో! లోకకళ్యాణ మొనగూర్ప రావో !

[బ్రహ్మ ప్రవేశించును]

బ్రహ్మ : శివకేశవులారా ! అధికార పురుషులగు తమకీ కయ్యమేల! నారదా! ఇట్టి యుపద్రవ మెట్లుకలిగినది!

నా : ఏమని చెప్పుదును దేవా ! అనిరుద్ధునిఁ గొనిపోవలెనని కృష్ణుని నిశ్చయము. తనను జయించి కాని నగరము ప్రవేశింప వీలులేదని శంకరుని తీర్మానము. ఎవరెవరికి తీసిపోదురు ప్రభూ! జగత్తునకు వచ్చినది కాని...

బ్ర : (ఆలోచించి) ఓహో ! జగడమర్థమైనది. కృష్ణా ! చక్ర ముపసంహరింప రాదా !

కృ : వీలులేదు.

బ్ర : శంకరా! నీవైన త్రిశూలమును —

శం : వలనుపడదు.

నా : చక్ర త్రిశూలములు తారసిల్లుచున్నవి. ఇక నిచ్చట మాటాడువారుఁ గూడ నుండరు. ప్రళయమే సంభవించును.

బ్ర : ధర్మముపై నానపెట్టి, యిదే బ్రహ్మాస్త్రమును సంధించి – రెంటి సంఘర్షణమును, నొక్కగడియ కాలము నిలుపుచున్నాను.

నా : ఓహో! చక్ర త్రిశూలములు చెఱియొక ప్రక్క నిలిచి పోయినవి. అధికారపురుషులు సమానశక్తిమంతులు.

బ్ర : కృష్ణా! శంకరా! బాణా! నేనొక ధర్మబద్ధమగు నిర్ణయమునుఁ జేయుచున్నాను. ఎల్లరకు నంగీకారమే కదా!

మువ్వురు : ధర్మమునుఁ గాదనువా రెవ్వరు?

బ్ర : బాణునిపై చక్రము ప్రయోగింపబడిన యనంతరము త్రిశూలము ప్రయోగింపబడినది. జీవుల యాయువునకు కారకుఁడను నేను. బాణప్రాణములకు బాధ్యతనాది. శంకరుఁడు నగరరక్షకుఁడు. కృష్ణుని నగరమునుఁ జొచ్చుకొననీకుండఁ జేయు బాధ్యతనాది. శంకరుని విధ్యుక్త ధర్మము నిర్వహింపఁబడుచున్నది. కాన త్రిశూల ముపసంహరింపఁబడవచ్చును.

శం : అవశ్య ముపసంహరించితిని.

బ్ర : అనిరుద్ధుని బంధించుటకు బాణుఁడు ప్రత్యక్ష కారణమే కాని యాతనికి శాపముకలదు. గడువయినది. ఆతఁడును శాపవిముక్తుఁడై, కావలివారలతో యుద్ధము చేసి –

గెలిచి, చెఱనుండి యీవలకు వచ్చుచున్నాఁడు. కాన ననిరుద్ధునకై పోరాడవలసిన యవసరము కృష్ణునికి లేదు. కాగా యుద్ధకారణము నశించినది-కృష్ణుతోఁ బోరాటమున గోఁడి బుద్ధిపూర్వకముగ ననిరుద్ధుని గృష్ణుని కొప్పగించినదియు లేదు. కృష్ణునికి యుద్ధకారణము నశించినప్పుడు, బాణునికిని యుద్ధము లేదు. శివుని బాధ్యతయు లేదు.

నార : సమంజసముగా నున్నది. ఇదో యనిరుద్ధకుమారుఁడు.

[అనిరుద్ధుఁడు ప్రవేశించి త్రిమూర్తులకును నారదునకును నమస్కరించును.]

నారదుఁడు, త్రిమూర్తులు : చిరంజీవ.

బ్ర : చక్రము దివ్యాయుధము. త్రిశూలము కూడ నట్టిదే. కాని రక్షణామాత్రముగ నది ప్రయోగింపబడినది. రక్షణకు నేను బాధ్యత వహించితిని. కాన దాని ప్రయోజనము సిదించినది. బాణుఁడు కండకావరమున నీశ్వరు నంతటివానిని యుద్ధమున కాహ్వానించెను. అతఁడును కినిసి, యాతని బాహువులను తాను ఖండించుట కిష్టము లేక – తన యంతవాఁడు ఖండించునని శపించినాఁడు. ఈ విష్ణుచక్ర మీశ్వర వాక్యమంత సామర్థ్యముకలది. రెంటికిని ప్రయోజనము, బాణ బాహు ఖండనము. బాణుఁడును దానిని ధిక్కరించుటకు వీలులేదు. పరమ శివభక్తుఁడు శివ వాక్యమున కన్యథాత్వము గోరునా? విష్ణువు, చక్రముచేఁ దన బాహువులను ఖండించెనని బాణుఁ డనుకొనరాదు, చక్రము శివవాక్యమునకు సాధనామాత్రము;

అంతియే. అందుచే బాణునకు ద్విబాహుత్వము స్థిరపరచి మిగిలినవి ఖండింపఁబడవలసిన విధి. ఇదే బ్రహ్మాస్త్ర ముపసంహరించితిని. చక్రమా !

[బాణుఁడు ప్రక్క తెరలోనికిపోయి, ద్విభుజావశేషుఁడై వచ్చును]

నా : సహస్ర బాహువులును ద్విభుజావశేషముగా ఖండింపబడినవి. చక్రము కృష్ణునిఁ జేరినది.

బ్ర : దాంపత్య లిఖితము నాయందే ప్రవర్తిల్లును. ఉషానిరుద్ధు లితఃపూర్వ వివాహితులు. వారికి శిశువునుఁ గలుగనైయున్నది. వారు దీర్ఘాయురుపేతులు. దాంపత్యము ధర్మవిరుద్ధమును కాదు. అదియునుఁ గాక వీరికెడఁబాటు గల్గించి సాధింపఁదగిన ప్రయోజనమును లేదు.

నా : యుక్తముగనే యున్నది.

బ్ర : ఉషావ్యాజమున నీపోరు సంభవించినది. కాని యెట్లును భూభారము తగ్గవలసినదే.

నా : దేవా! బాణాసురునికి, తాము దేవతా పక్షపాతమున జెప్పితిరేమో—యను ననుమానమున్నట్లు, నాకుఁ దోచుచున్నది.

బ్ర : నారదా ! నీకట్లుఁ దోచుటయే లేకున్న నిదింతవఱకెట్లు వచ్చును ! బాణాసురుని వంటి భక్తుఁడు 'నభూతో నభవిష్యతి'. ఆతఁడీశ్వరునకు భక్తుఁడైనను త్రిమూర్తులకును భక్తుఁడయినట్లే. ఆతనివంటి యదృష్టవంతుఁడును లేఁడు. ఈశ్వరుఁడు నగరరక్షకుఁడు,

విష్ణువు వియ్యంకుని తండ్రి. బ్రహ్మ యయాచిత సంధికారకుఁడు.

కాని యాతని రక్తములో సాత్త్వికకణముల కన్న రాజస తామస జీవకణములే విశేషముగ నున్నవి. అతఁడు దానవుఁడగుటయే దీనికి కారణము. దేవదానవ విరోధమాతని నరనరమునకును బట్టియున్నది. అతనికి సమత్వబుద్ధి కలుగుటకు బ్రహ్మజ్ఞానమునుఁ బ్రసాదించు చున్నాను.

కృ : నా భక్తుఁడగు ప్రహ్లాదుని వంశమున నీతఁడీ వరమును బొందుట నా కెంతయు నభిమతము.

నా : త్రిమూర్తుల యెదుట నేనొకటి విన్నవించు కొను చున్నాను. అధికారపురుషులు కదా! ఈ యాయుధము లేమి! యుద్ధమేమి? అరిషడ్వర్గములు కలవారివలె నీ ప్రసంగములేమి? ఈ చిక్కు విడదీయరా! తాము ప్రారబ్ధకర్మ వశవర్తులేనా? అయిన విశేష మేమి?

బ్ర : నారదా! ఈ విషయము నీకునుఁ దెలియనిది కాదు. లోక సంగ్రహమున కడుగుచుంటివి. అధికార పురుషులకుఁ బ్రారబ్ధ మెప్పుడును లేదు. కాని వ్యవహారమున నట్లు కన్పింపకుండుటకు వీలులేదు. అధికార పురుషులుగా వ్యవహారమునఁ గన్పించుటయే యస్వభావము. రామావతారమున సీతకై రాముఁడు విలపింపలేదా? దేవుఁడాలికై యేడ్చుటేమి? పాత్రోచితముగ నుండుటయే కదా సృష్టివైశిష్ట్యము!

బా : మబ్బు విడిపోయినది. ఈ వెలుఁగుదారులలో నుపాని
షద్ధుల మువ్వురు మూర్తులు నాశీర్వదింపఁ బ్రార్థనము

త్రిమూర్తులు : శుభంభూయాత్.

## భ ర త వా క్య ము

భరతదేశమ్ము సర్వ ప్రపంచమునకు
శ్లోకమగు నేఁడు నుపనిషత్సుధల చిలికి
విశ్వకల్యాణ మూర్తుల వేదవాక్కు
పరిమళించుత చిత్కళల్ పండి కడల.

— సంపూర్ణము —



# ఉషాసుందరి

---

**ప్రవంతి**

ఇది యుషాపరిణయ నాటకము. మనోహరముగా రచింపబడినది. గ్రంథము చిన్నదైనను పాండితీపరిమళ భరితము.

**శారద**

భాగవతము దశమ స్కంధములోని నుత్తరభాగమునఁ గల 'యుషాసుందరి' కథకు రచయిత కొన్ని మార్పులుచేసి యయిదంకముల నాటకముగా వెలయింపఁ జేసినారు. సునిశిత హాస్యముతో లలిత శృంగారముతో నాద్యంతములు నాటకము శోభిల్లుచున్నది. ప్రతి గ్రంథాలయము నలంకరింపవలసిన కావ్యము.

**వాహిని**

తెలుగునాట సుపరిచితమైన "యుషాపరిణయము" కథను రసవత్తమమైన నాటకరాజముగా రూపొందించినారు. సాహిత్యపు విలువలతో ప్రయోగానుకూలముగా వినూత్న రీతులతో నియమబద్ధంగా వినిర్మితమైన యీ యుత్తమ కళాసృష్టి నాటక సాహిత్యాని కొక అమూల్యాభరణము.

**జన్మభూమి**

ఈ కవిది పూలశైలి. పలుకు చాల మృదువు. సంభాషణముల కూర్పులో నెన్నదగిన నేర్పున్నది. ఉషానిరుద్ధుల ప్రణయ భావము కొమ్మకొన పూవు వలె కవి కలాన విప్పారింది.

వాజపేయయాజుల రామసుబ్బారాయుడు,
అధ్యక్షుడు : స్నేహలతా కవితా సంఘము.
శ్రీ జటప్రోలు సంస్థానం.
1945

చెందితి మేటి సంతసముఁ జిత్తము మిక్కిలిఁ బొంగగా 'నుషా సుందరి' నాటకంబుఁ గనుసొంపుగఁ జూచి పఠించి నంత నా పౌంరికయున్ మనోహరము పువ్వులగుత్తియు వోలె నందముఁ జందముఁ గాంచినట్లుగఁ గనంబడు సౌరభకాంతులందునన్.

'శివునిపేరెత్తి యెవడు దూషించువాడొ
వాని శిరమడివేయిగాఁ బగులవలదె
శంకరునిఁబోలు దైవమ్ము జగతిఁగలఁదె?
కరుణవారాశి యెవడు ముక్కంటి సాటి'

ఇట్టి మనోహరంబులగు నెన్నియొ పద్యము లిందులో రసం బుట్టిపడన్ గనంబడి యపూర్వముదంబును గూర్చె. నాటకం బిట్టిదె బాలబాలికల కెప్పుడు జ్ఞానపథంబుఁ జూపు నే పట్టునఁ జూచినన్ హృదయపర్వముగా నిది వెల్గులీనెడున్.

ఇద్ది పఠనీయ కావ్యమై యెసఁగుచున్నఁ
జెప్పనేల? విద్యార్థుల గొప్పతనము
తెలుగు తళుకుల బెళుకుల వెలుఁగునీను
'మధురకవి' కృతమియ్యది మాటలేల?

ధారయందున రచనా విధానమందుఁ
లోకదలయందు నడకలపొలుపునందు
భావమందును ముందంజవైచు పైడి
పాటి కృతులు శ్లాఘ్యంబులే బాటనైన.

బంగారు పాళీలు :

# శ్రీ సుబ్బరామశాస్త్రి

తెలుగు జాతినీ, తెలుగు కీర్తిని, తెలుగు కళలను ప్రశం సిస్తూ కవిత్వం వ్రాసిన కవులు మనకు చాల కొద్దిమంది వున్నారు. రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి యీ విధంగా వేళ్లమీద లెక్క పెట్టవచ్చు. అల్లా వేళ్ళమీద లెక్కపెట్టగలిగిన వారిలో శ్రీ పైడి పాటి సుబ్బరామశాస్త్రి గారొకరు. సహృదయులు, స్నేహ పాత్రులు శ్రీ సుబ్బరామశాస్త్రిగారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక చాలమంది జాతీయతను రేకెత్తించే కవిత అనవసరము అనుకుంటూ వచ్చారు. కాని స్వాతంత్ర్యము వచ్చినతర్వాత జాతీయాభివృద్ధి కార్యక్రమాలపట్ల ఆసక్తి కలిగించడానికేమి, జాతీయతను రేకెత్తించడానికేమి కలం సాగించవలసిన ఆవశ్యకతను గుర్తించినవారు చాల అరుదు. అటువంటివారిలో శ్రీ పైడిపాటివారు ఒకరు.

దేశ స్వాతంత్ర్యానికి పూర్వం వీరు "దేశం" అన్న గేయ కావ్యము వ్రాశారు. వీరు రచించిన "జాతీయ భారతి" పలువురి రాజకీయవేత్తల, నాయకుల, సాహితీపరుల ప్రశంసల నందుకుంది. ఈ గ్రంథావిష్కరణ సమయంలో వీరికి కవి సామ్రాట్టు బిరుదు లభించింది. అల్లాగే జయభారతి, విజయభారతి, మొదలైన జాతీయ గేయ సంపుటాలను ప్రచురించారు.

శ్రీ సుబ్బరామశాస్త్రిగారు ఒక్క జాతీయగీతాలే వ్రాస్తా రనుకోవడం పొరపాటు. "వరదకృష్ణమ్మ" వంటి భీభత్సాన్ని

తెలిపే రచనలు, శృంగారమయమయిన "మధురభారతి" వంటి కావ్యాలను వీరు రచించారు. వీరు వ్రాసిన "నృత్యభారతి" లో కూచిపూడి నాట్యపద్ధతిలో రచింపబడిన గేయాలు రాష్ట్రేతరుల దృష్టి నాకర్షించాయి. బాలసాహిత్యంలో వీరు కొంత కృషిచేశారు.

వీరి కథలు కొన్ని "నీలం" అనే పేరుతో పుస్తకరూపాన్ని పొందాయి. "కవిరాజు" అనే నవలను "జన్మభూమి" లో ప్రకటించారు.

వీరునటులు : భమిడిపాటివారి ప్రహసనాలలో, ప్రతాప రుద్రీయ నాటకంలో నటించారు. వీరు నాటక రచయితలు : "ఉషా సుందరి" అనే నాటకం రచించారు.

చిన్నతనంలోనే అష్టావధానం, శతావధనంచేసి ఆ తర్వాత నవ్య సాహిత్యంలోకి వచ్చారు,

''తూణీరం" అన్న పేరున ఒక విమర్శక గ్రంధం వ్రాశారు. ఆంధ్రభారతి, "అభిషేకం", "దివ్వటీలు" ఇటీవల ప్రచురింపబడ్డ కొన్ని పద్యకావ్యాలు.

సాంఘిక సమస్యలపై వీరు ప్రజామిత్రలో అనేకవ్యాసాలు వ్రాశారు. నాట్యం వీరి అభిమాన విషయం.

(చుక్కాని 1959 ఏప్రియల్ 1)

---

S. Venkataramaiyar, B.A., L.T.,
HEAD MASTER.

MUNICIPAL HIGH SCHOOL.
ELLORE.

Date 3-11-1934

This is to certify that Payidipati Venkata Subbarama Sastry had passed the S.S.L.C Public Examination held in March 1934 and that his progress and character had always been excellent.

He has developed a taste for Telugu literature and drama and had enacted many parts in the dramas to the entire satisfaction of the audience.

I wish him success in his career as a Telugu poet.

S. Venkataraman
3-11-34